# ప్రవంతి

## సాహిత్య మాస పత్రిక

వెల : రూ|| 4-00

సెప్టెంబరు - 1994



**దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర, హైదరాబాదు.**

## వాణీ హిందీ విద్యాలయము—విజయనగరము



ప్రమాణపత్ర వితరణోత్సవము సందర్భంగా ముఖ్య అతిథి శ్రీ పి.అశోకగజపతిరాజు గారు ప్రసంగిస్తున్నారు. ఈ చిత్రంలో శ్రీ బి. పి. మిశ్రా, శ్రీ వి లింగమూర్తి, శ్రీ పి ఎల్. పి. రాజు గారు ఉన్నారు

టెలిగ్రామ్: హిందీసంఘ్ ఫోన్ ; 316865

486

# నవం

## సాహిత్య మాసపత్రిక

సెప్టెంబరు–1994

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర

ఖైరతాబాద్ హైదరాబాద్–500 004

సంవత్సర చందా 40–00 రూ॥

విడిప్రతి 4–00 రూ॥

Recommended for use in all the Public libraries and School Libraries by the Director of Public Libraries, Andhra State Madras, Vide proceedings Dis No. 30/55 dated 6th January-1955.

---

# ఈ సంచికలో


1. సంపాదకీయం

2. దాశరథి కవితా వ్యక్తిత్వం—2 — మాదిరాజు రంగారావు

3. మనుచరిత్ర—సమకాలీన సమాజం — డా॥ కె బి. —రాజేంద్రప్రసాద్

4. కవిత్వము—విమర్శ — కీ॥ శే॥ సర్దేసాయి తిరుమలరావు

5. చలం జీవితం—ఆధ్యాత్మికత — డా॥ డి. ప్రభాకరరావు

6. రామబాణము — ఊట్ల కొండయ్య

7. మూడు కవితలు — అడిగోపుల వెంకటరత్నం

8. సొల్యూషన్ — డా॥ జి. ఉషాలావణ్య

9. భావకవిత్వము—దానిశాఖలు — టి. వసంత

10. నవల—సమకాలీన సమస్యలు — డా॥ ఎ. బి. సాయిప్రసాద్

11. పుస్తక సమీక్ష

12. వార్తావాహిని.

సంపాదకీయం

# సెప్టెంబరు 14

సెప్టెంబరు 14వ తేదీ హిందీ దినంగా పరిగణింపబడు తున్నది. ఆతేదీనాడే భారత రాజ్యాంగ చట్టంలో హిందీ భారత రాజభాషగా అంగీకరింపబడింది. గాంధీ మహాత్ముని ఆదేశం ప్రకారం రాష్ట్రభాష రూపంలో దేశమంతటా ప్రచారంలో వున్న హిందీకి అనాటినుండి చట్టబద్ధంగా రాజభాషా స్వరూపం ఏర్పడింది. అందువల్లనే భారత ప్రభుత్వమూ, హిందీ సంస్థలవారూ ఆ దినాన్ని హిందీ దినంగా భావించి హిందీ ప్రచార వారోత్సవాలను నిర్వహిస్తున్నారు.

రాష్ట్రభాషగా హిందీ ప్రచారంలో వున్నంత కాలం ప్రజలందరూ దానికి సహకరించారు. వేలకొలది మంది విద్యార్థులు హిందీ నేర్చుకొన్నారు. ఇప్పటికీ నేర్చుకొంటున్నారు అయితే అది రాజభాషగా అంగీకరింపబడిన తరువాత ఒకటి రెండు ప్రాంతాలలో హిందీ వ్యతిరేకత బయలుదేరింది. మరీ ఒక ప్రాంతంలో రాజకీయ వాదులు రాజకీయ సాధనంగా ఉపయోగించుకొని హిందీ వ్యతిరేకతను ప్రోత్సహిస్తున్నారు. ప్రజలనురెచ్చగొడుతున్నారు. రాజకీయవాదు లెంత ప్రయత్నం చేసినా, ఏమన్నా ఆ ప్రాంతంలోని జనసామాన్యం దేశపరిస్థితినీ, అవసరాన్ని గుర్తించి ఎంతో ఉత్సాహంగా హిందీ నేర్చుకొంటున్నది. తమిళనాడులో హిందీ పరీక్షలకు హాజరవుతున్న హిందీ విద్యార్థులసంఖ్య అందుకు నిదర్శనం హిందీ వ్యతిరేకత నిజానికి అర్థంలేనిది. దేశానికి హితకరమైనది కాదు. భారతదేశంలో పలుభాషలు ప్రచారంలో వున్నవి. అవి పరిపుష్టమైన సాహిత్య సంపదతో విరాజిల్లుతున్నవి. సృజనాత్మక సాహిత్య నిర్మాణంలో ఎంతో ముందంజవేసివున్నవి. ఆ భాషల అభివృద్ధిని ఆపడం సాధ్యమైన పనికాదు. అది ఎవ్వరూ చేయలేరు. అయితే ఇది వరలో మనల్ని పాలించిన ఆంగ్లేయులు మనభాషలకు ప్రభుత్వరంగంలో తగిన ప్రాముఖ్యత లేకుండా చేశారు. అందువలన దురదృష్టవశాన ఎంతో సాహిత్యసంపద కలిగిన మనభాషలు పరిపాలనా రంగంలో తగిన స్థానాన్ని పొందలేకపోయినవి. గాంధీగారు అది గుర్తించి భారతీయ భాషలకు భారత ప్రభుత్వ కార్యకలాపాలలో

ప్రముఖస్థానం కల్పించవలెనని కృషి చేశారు ప్రాంతాలలో ప్రాంతీయ భాషలకూ కేంద్రంలో అనుసంధాన భాషగా హిందీకి ప్రాముఖ్యం కలగవలెనని ఉద్బోధించారు. హిందీ అనుసంధాన భాష. ప్రాంతీయభాషల వికాసానికి అదివ్యతి రేకంగాదు అదే గాంధిగారు ఆశించినది. హిందీ ప్రాంతీయభాషల్ని అణచివేస్తుందనీ, ఏకచ్ఛత్రాధి పత్యం వహిస్తుందనీ హిందీ వ్యతిరేకవాదులు చేస్తున్న వాదనలో నిజం లేదు. అది సంభవం గూడా కాదు. అందుకు ప్రయత్నించిన ఇంగ్లీషుభాష సఫలం కాలేదు. అది మనకందరికీ తెలుసు. జనసామాన్యం చైతన్యవంతమైనది. పూర్వంలాగా లేదు. అందువలన ఒకభాష ఇంకొకభాషను అణచివేయడం జరిగేపని గాదు. జరగదు. ప్రాంతీయభాషలకూ, అనుసంధాన భాషగా అంగీకరింపబడిన హిందీకీ కొన్ని హద్దు లున్నవి. వాటి ఉపయోగానికి ఒక లక్ష్యమున్నది ఒక ఆదర్శమున్నది. వాటిని మరచి వ్యవహరించడం సాధ్యంగాదు. ఈ సత్యాన్ని ఎంతతొందరగా గుర్తిస్తే అంత మంచిది

ఈనాడు మనమందరం భారతీయభాషల వికాసానికీ, తమకు, నిర్దిష్టమైన రంగాలలో అవి పనిజేయడానికి కలసి కృషి చేయాలి. అందుకే హిందీ ప్రచారవారో త్సవాలు నడపడం. హిందీ దినోత్సవాన్ని భారతీయ భాషా దినోత్సవంగా జరప వలెననే అభిప్రాయంగూడా ఒకటున్నది. హిందీ దినోత్సవాన్ని భారతీయ భాషా దినోత్సవమన్నా, హిందీ దినోత్సవమన్నా లక్ష్యం ఒక్కటే. ఆ లక్ష్యసిద్ధికి ప్రయ త్నం చేయడమే మన కర్తవ్యం. అందుకే ఈ ఉత్సవాలు. ప్రతి సంవత్సరం సెప్టెం బరు 14వ తేదీన జరుగుతున్న ఈ ఉత్సవాలు అందుకు తోడ్పడగలవని ఆశిద్దాము.

# సాహిత్యవీధి

## దాశరథి కవితా వ్యక్తిత్వం-2

మాదిరాజు రంగారావు

'చిమ్మ చీకటిలో తూర్పు సెమ్మెమీద
దివ్వె ఒక్కటి వెలిగించి రువ్వినావు
వెలుతురుల బాకు ! ఆకాశ వీధిలోన
ఎవరవయ్యా! ప్రగాఢ సౌహిత్యమూర్తి'

నీ వెరుగవె! శ్రీరాముడ!
నేను మానవుడనె లెమ్ము!
నిద్రాణాంధ్ర ధరాస్థలి
నేడు మేలుకొల్ప గలను'

ఇది ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వం చీకట్లను చూసిన పథా చిత్రణం. శ్రీ పొట్టి శ్రీరాముల ఆత్మాహుతి నుండి అవతరించింది ఆంధ్రరాష్ట్రం నిద్రాణమైన తెలుగు భూమిని స్వరాష్ట్రం కోసం మేలుకొల్పేందుకు దీక్ష పూనినాడు గాంధీజీ శిష్యుడు. ఆయన విసరిన ఆయుధం అహింసాయుతమైంది. శాంతి లక్ష్యం కలిగింది. సువిశాల దృక్పథం గల మహాకవి సామాజిక స్పందనలో ఎప్పటికీ ఒకే ఒక పరిమితమైన వలయంలో నిలిచిపోడు. అనేకమైన చారిత్రక కారణాల వల్ల ఒక నిర్దిష్టమైన లక్ష్యంతో పరిమితుల్ని స్వీకరించవచ్చు. ఇది అనివార్యం. గమ్యం చేరాక ఆ సీమల్ని, వాటి విస్తృతమైన ప్రయోజనంపై దృష్టితో స్పందిస్తాడు. ఆలోచన చేస్తాడు. ఇది నిరంతరం జరిగే మానవ చరిత్ర పోనుపోకు వలయాల్ని అతిక్రమిస్తూ మానవతా [illegible]ధంతో విశ్వాంలాల్ని స్పృశించడమూ కద్దు ఇది మహాకవి ఉదార చరిత్రకు నిదర్శనం.

దాశరథి కవితా వ్యక్తిత్వంలోను ఈ దశల్ని స్పష్టంగా గుర్తించవచ్చు. ప్రస్తుతానికి వస్తే మొదటి దశ హైదరాబాదు రాష్ట్ర విమోచనం, అందునా తెలంగాణా స్వాతంత్ర్యానికి చెందింది. రెండోది తెలుగు వాళ్ళను ఏకం చేసే మహోద్యమాన్ని అభిలషించింది. మొదటి దానిలో ఈయన క్రియాత్మకమైన వ్యక్తిత్వం స్వయంగా ఉద్యమించింది. రెండో దానిలో ఈయన భావాత్మకమైన వ్యక్తిత్వం సౌందర్యంతో ఉత్క్రమించింది. ఈ రెండూ ఒక దాని రూపంతో మరొకటి ధారికంగా పరిణామ గతుల్ని పొందాయి. ఈనాటి స్వతంత్ర భారత స్వరూపానికి ఒకొక్కటీ వివిధ దశల్లో ఒక్కొక్క విధమైన పాత్రను వహి

S

---

కాకతీయ యూనివర్శిటీ విద్యారణ్యపురి, వరంగల్–506 009.

హించాయి. చారిత్రకంగా చూస్తే మొదటిది వివిధ స్వతంత్ర సంస్థానాల విలీనంతో స్వతంత్ర భారతం పరిపూర్ణ స్వరూపానికి దోహదం చేసింది. రెండోది భాషా రాష్ట్రాల ప్రాతిపదికపై భారత దేశం అభ్యుదయానికి ప్రజాస్వామ్య సుస్థితికీ హేతువైంది. పద్య 'భాషా రాష్ట్ర మటన్న వాంఛిత మునుత్పాదించి మా తెల్గువా డాషా మాని కబుర్లుగా ! ఇదిగో ప్లీరు కవ్వించినన్ రోషం బందక సహ్యమిచి గెలిచెన్ లోకంబు హర్షింప ప్రత్యూషం బిన్ని దినాంకైనది స్వారాష్ట్రోద్యానభాగంబునన్'

తెలంగాణా విముక్తమయ్యాక ఆంధ్రావతరణం తరువాత మహాంధ్రోదయం ఒక స్వప్నం! లక్ష్యమైంది మూడుకోట్ల (అప్పటి జనసంఖ్య) తెలుగు ప్రజల్ని సమీకృతంచేసి మహాంధ్రంకోసం ఉపక్రమించడం జరిగింది. ఉభయ ప్రాంతాల ప్రజల్ని ఉద్బోధించి సౌమనస్యాన్ని సాధించేందుకూ సోదరభావాన్ని నెలకొల్పేందుకూ ఈ దశలో ప్రజాభిప్రాయాన్ని మలచేందుకు ఈ కవి ఉద్యమించాడు.

'కోటి కంఠాలతో తెలుంగులు సతమ్ము
ఆంధ్ర రాష్ట్రావతరణ శుభావసరము
గోరుచున్నారు, కలిసి పోగోరుచుందు
రగ్రజుల తోడి వీలైనయంత వడిగ'

తెలుగు భాష–సంస్కృతికి చెందిన విశాలమైన దృష్టితో ఆంధ్ర మహాప్రజ సమైక్యంగా వర్ధిల్లే ఏకైక రాష్ట్రాన్ని కాంక్షించే సంకల్పం వాస్తవమైంది. దీని వెనుక నున్న చారిత్రక నేపథ్యం గురించి స్థూలమైన ప్రస్తావన ఈ సందర్భంలో అవసరము.

## 2

ఆంధ్రులు తమ ప్రత్యేకతను నిలుపుకునేందుకు తమ భాషనూ సంస్కృతినీ వికసింప చేసుకునేందుకు ఇరవయ్యో శతాబ్దం ఆరంభం నుండి (1910) అనేక సంస్థలు స్థాపితమైనాయి. ఉద్యమాలు వెలిసాయి. కందుకూరి, రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి, పానుగంటి మొదలైన మహా రచయితలెందరో భారతదేశంతో పాటు ఆంధ్ర జాతి ఔన్నత్యాన్ని కీర్తించారు ప్రజల్లో ఆంధ్రాభిమానం వికసితమైంది. సమాజాభివృద్ధికై అనేక రంగాల్లో కృషి మొదలైంది. ఆంధ్ర జాతీయ కళాశాల, విజ్ఞాన చంద్రికా గ్రంథమండలితో పాటు వివిధ గ్రంథాలయాలూ నెలకొన్నాయి. ఆంధ్ర పత్రిక మొదలుగా తెలుగు పత్రికారంగం ఆవిర్భవించింది. ఆంధ్రుల చరిత్రకూ సంస్కృతికీ సమగ్రరేఖలు దిద్దే ప్రయత్నం జరిగింది. సాహిత్యాన్నీ సంస్కృతినీ సమాజావసరాల కనుగుణంగా, సంస్కరణ దృక్పథంతో పరివర్తన గుణంతో పునర్నవీకృతం చేసే ఉద్యమం విస్తరించింది. ఇదంతా చివరకు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర వాంఛ కభిముఖంగా ప్రవర్తిల్లింది. అయితే ఆంధ్రరాష్ట్రానికి చెందిన అగ్రనాయకులు కొండా వెంకటప్పయ్య, బులుసు సాంబమూర్తి, టంగుటూరి ప్రకాశం అయ్యదేవర కాళేశ్వరరావు, కాశీనాథుని నాగేశ్వరరావు మొదలైన పెద్దలంతా 'ముందు దేశస్వాతంత్ర్యం ఆ తరువాత ఆంధ్రరాష్ట్రం' అన్న అభిప్రాయానికే ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. కేంద్ర నాయకులు దీన్ని బలపరచారు

తెలుగు మాట్లాడే ప్రజలు నివసించే ప్రాంతాలన్నీ ముక్కలుగా చెదరిపోయాయి. అనేకమైన చారిత్రక కారణాలవల్ల వేరు వేరు అస్తిత్వాల్ని సంతరించుకున్నాయి. వేరు వేరు ప్రభుత్వాల పాలనలోకి వచ్చాయి. ఇది ఒక విధంగా ప్రాదేశిక భాషా సంస్కృతికి చెందిన ఏకత్వాన్ని కుంఠితం చేసింది. తీవ్రమైన అసమానతల్ని సృష్టించింది.

అయితే ఒక విధంగా కొన్ని కొన్ని ప్రత్యేకతలలో భారత దేశం సమగ్ర రూపానికి ఏకత్వానికి దారి తీసిందని తృప్తి పడే అవకాశమూ లేక పోలేదు కోస్తా ప్రాంతం. రాయలసీమ నేరుగా బ్రిటిష్ పాలనలోకి వచ్చాయి. అక్కడి పాలనా భాష ఇంగ్లీషు. రాజధాని మద్రాస్. ఆ నగరం తమిళం తెలుగు భాషా సంస్కృతులకు నిలయమైంది. ప్రభుత్వ యంత్రాంగంతో పాటు పత్రికలు పరిశ్రమలు మొదలగు ఎన్నో సంస్థలతో ఈ నగరం తమిళులతో పాటు తెలుగు వారికీ ప్రతిష్ఠాకరమైందిగా పరిణమించింది. హైదరాబాదు రాష్ట్రం తెలుగు కన్నడం మరాఠీ ప్రాంతాలతో ఏర్పడింది. నిజాం పాలనా భాష ఉర్దూ! ఇట్లా చెదరిన భాషా ప్రాంతాలన్నీ కలిపి భాషా ప్రాతిపదికపై రాష్ట్ర నిర్మాణం అవశ్యకత గురించి ఆలోచన ప్రబలింది. భారతదేశం స్వాతంత్ర్యం పొందే వరకు అందుకు వేచి ఉండవలసి వచ్చింది.

భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందాక మూడు నెలల తరువాత పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ 1947 నవంబరు 27 వ తేదీన భాషా రాష్ట్ర నిర్మాణం గురించి విధాన ప్రకటన చేయడం జరిగింది. 1950 జనవరి 26 న భారత రాజ్యాంగం అమలు లోకి వచ్చింది. ప్రజల భాషలో ప్రభుత్వ కార్యకలాపాలు జరిపే అవసరం గుర్తింపబడింది. అపుడే ప్రజాస్వామ్యం సఫలమౌతుందన్న అభిప్రాయానికి బలం చేకూరింది. ఎన్నికలు వచ్చాయి. ప్రజల అభిమతానికి ప్రాముఖ్యం వచ్చింది, 1952 ఆగస్టు 15 వ తేదీన స్వామి సీతారాం నిరవధిక నిరాహార దీక్ష 38 రోజుల తరువాత విరమింపబడింది.

ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని సాధించే ప్రయత్నంలో 1952 అక్టోబర్ 19 న తేదీన మద్రాస్ మహనీయులు బులుసు సాంబమూర్తి ఏర్పాటు చేసిన యజ్ఞశాలలో గాంధీజీ శిష్యులు పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహార దీక్ష మొదలైంది. 'నాకే పార్టీ లేదు— ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం ఒక్కటే నా లక్ష్యం' అని ప్రకటించడం జరిగింది. తెలుగు ప్రజలందరు ఆయనలో తమ ఆదర్శాన్ని దర్శించారు. 1852 డిసెంబరు 14 న అర్ధరాత్రి ఆయన తుదిశ్వాస విడిచారు శాంతియోధుని ఆత్మార్పణం ప్రజలలో అశాంతిని రగిల్చింది ఆంధ్ర రాష్ట్రం సాధన కోసం ప్రజలలో ఉద్యమం ఉజ్జ్వలితమైంది.

'వెలుతురు బాకు తాకిడికి విచ్చిన చీకటి కాలరాత్రి
గుండెల జిలుజిల్లునన్ రుధిర నిర్ఝరి పారె దిగంగనాముఖమ్ముల నవ కుంకుమ ప్రభలు మొల్చెను
తామర మొగ్గలట్లు తల్పులు తెరువుండు రండు పిలువుండు
శయించిన వారి నెల్లరన్'

అర్ధరాత్రి చీకటిలో రువ్విన వెలుగు చకిత చకితంగా ప్రజల్ని మేల్కొల్పింది అది శాంతి సమరం! అహింసయే ఆయుధం అయినా ఇంకా మేల్కొనని వారూ ఉన్నారు! వారికై ఈ ప్రబోధం! ఆ వెలుగు తెలుగుగా దర్శితమైంది. ఆనాటి ఉషస్సు పొట్టిశ్రీరాములు ఆత్మాహుతితో పవిత్రమై ఉదయించింది

1952 డిసెంబరు 19వ తేదీన నెహ్రూ మద్రాస్‌నగరం మినహా ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుకు సంసిద్ధతను ప్రకటించారు. 1953 అక్టోబర్

ఒకటో తేదీన నిర్వివాద ప్రాంతాలలో ఆంధ్రరాష్ట్రం కర్నూల్ రాజధానిగా ఏర్పడింది ఆంధ్రుల చిర స్వప్నం వాస్తవమై రూపొందింది. తెలుగు వ్యక్తి భారతదేశంలో భాషారాష్ట్రాల నిర్మాణానికి హేతు భూతుడైనాడు. తెలుగువాడు కార్యకుశలుడన్న యథార్థాన్ని చాటిచెప్పిన సంతోష సమయమది! ఆనాటి ప్రత్యూష భారతదేశచరిత్రలో నవదశకు నాంది పలికింది.

‘‘తలలు వాలిచియున్న నా తెలుగు జనము
ఉన్నతోన్నత పర్వతాలో యనంగ’’

విజయ గర్వంతో ఆంధ్రుల వ్యక్తిత్వం నలుగురినీ ఆకర్షించింది. మామిడి పాటినట్లు, మధుమాసము హాసము చేసినట్లు శ్రీరాముని ప్రాణదానమున రాగిలె తెల్గుల ఇంటిలోన ఆరామము పూలతో ఫలభరమ్ముత వంగిన భూజరాజిలో ప్రేమముతో మృదు ప్రణయ రేఖలతో అనురాగకాంతితో’’ ఒకాంతి అణగింది. అసహనం అంతరించింది. వసంతం విలసిల్లింది. ఆనందం అనురాగం ఆర్ద్రతతో తెలుగుదేశం పల్లవించింది రసస్విన్నమైంది. స్వరాష్ట్రోద్యమం మొదటినుండీ స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా పర్యవసితం కావడంచేత దేశభక్తిని శంకించే అవసరమే కలుగలేదు. పైగా భాషారాష్ట్ర నిర్మాణం భారతదేశ సమగ్ర వికాసానికి జీవభూతమైందిగాను భావితమైంది.

‘కోటి కంఠాలతో తెలుంగులు నతమ్ము
ఆంధ్ర రాష్ట్రావతరణ శుభావసరమున
కోరుచున్నారు. కలిసి పోగోరుచుండు
రగ్రజులతోడ పీలైన యంత వరకు’

ఆంధ్రరాష్ట్రంతో తెలంగాణా ప్రాంతాలను కలిసి సువిశాలమైన రాష్ట్రంకోసం ఆరాటం ముమ్మురమైంది.

శ్రీ మాడపాటి హనుమంతరావు పిలుపు మేరకు 1954 జూన్ 13, 14 తేదీలలో విశాలాంధ్ర సదస్సు జరిగింది. ఒకవైపు నుండి హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణరావు మరోవైపు నుండి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి బెజవాడ గోపాలరెడ్డి ఇరువురూ తమ ప్రజల అభిప్రాయానికి ప్రాతినిధ్యం వహించారు. తెలంగాణా ఆంధ్ర ప్రాంతాల విలీనానికి సుముఖమైన వాతావరణాన్ని నెలకొల్పే ప్రయత్నం జరిగింది. తెలంగాణా ప్రజల్లో భయమూ వ్యక్తం కాకపోలేదు. అభయాలూ ఇవ్వబడినాయి. ఒప్పందాలు జరిగాయి. రాజకీయ రంగం మహాంధ్రావతరణానికి సిద్ధమైంది.

తెలంగాణా స్వాతంత్ర్యానికి ఉద్యమించిన మహాకవి విస్తృతమైన ప్రయోజనంతో తెలుగు ప్రాంతాలన్నీ కలిపి ఒకే రాష్ట్రంగా నిర్మించే అభిప్రాయాన్ని సహేతుకంగా బలపరచడం జరిగింది.

‘మూడు కోటుల ఒక్కటే ముడి బిగించి
కలిపివేయుము నా తెలంగాణ తల్లి!

అన్నాడు కవి.

కవి ఇరు ప్రాంతాల్లో పర్యటించాడు. సుహృద్భావాన్ని పెంపొందించాడు. 1956 ఆగస్టు 10వ తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరణకు 7వ రాజ్యాంగం సవరణ బిల్లు లోక్‌సభలో ప్రవేశపెట్టబడింది.

‘నాకు కావలె మహాంధ్రోర్వర!
రండి అన్నల్లార! తూరుపు
దారి కెదురుగ ద్వార బంధము
మనిషి మనిషి మనస్సు దారుల
రాగ బంధము రాగబంధము’

1956 నవంబర్ ఒకటో తేదీన హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతరించింది.

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'మహాంధ్రోదయం' కావ్యానికి పీఠికలో 'విశాలాంధ్రకంటె మహాంధ్ర పదమే నాకు వలెనే దాశరథికిని రుచించినది. మహాంధ్ర పదమే పరిగ్రాహ్యమేమో'; అన్న అభిప్రాయం గమనింపదగింది. ఈ సందర్భంలో మహాకవి సందేశం ఈ నాటికీ వర్తిస్తున్నది.

'కృషికుల్ కార్మికులెల్ల రొక్కటిగ సంగీతమ్ము లంబాడు డు
న్నిశితాంతః కరణమ్ములన్ తెలుగు భూమిం గూర్చి ఆనందపుం
చషకమ్మెత్తుడు; స్వీయ రాష్ట్ర జనతా సౌఖ్యార్థమై త్రావుడీ';
విషతుల్యంబగు భేద భావములు పృథ్విని మాసి పోనిందహో;

స్వరాష్ట్రాల నుండి సమస్త పృథ్వీ తలం పైన భేదాలు మాసిపోయి శాంతిని కోరే ఉదార తత్త్వం సర్వ జనప్రియమైంది. సమాజానికి కల్యాణ కరమైంది.

కాకతీయుల కాలంలో ఒకే రాష్ట్రంగా స్థిర పడిన ఆంధ్ర భూ ప్రజలు అనేకమైన చారిత్రక కారణాలవల్ల విడిపోయారు. మళ్ళీ ఈనాడు 1956 నవంబర్ ఒకటో తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరణంతో సమైక్యరూపాన్ని ధరించారు. దాశరథి కవిత్వం ఈ ఉద్యమ రూపాన్ని ప్రతిబింబించే ఆదర్శ శిఖరం.

ఈనాడు మహాంధ్రోదయమైనది
కోట్లాది ప్రజలు
తెలుగుల తల్లి పాదాలకు — —
వెలుగుల హారతి విడిరి !
తెలుగు; తెలుగు వెలుగు వెలుగు !
తెలుగు వెలుగు వెలుగు తెలుగు !
వెలుగు వెలుగు అంతటా వెలుగు !

ఆనందంతో కవితాగానంచేసి దాశరథి పారవశ్యం చెందాడు. దాశరథీ ! నీకు జోహారు.

# మనుచరిత్ర—సమకాలీన సమాజం

డా॥ కె. బి. రాజేంద్రప్రసాద్

'కవిత్వం—సమాజం' ఈ రెంటికిని ఒకానొక అవినాభావ సంబంధముంది. ఇది అవ్యక్తం, అనిర్వచనీయం. కవి ఈ రెంటికినీ సంధానకర్త లేదా సమన్వయకర్త అనవచ్చును. కవికి సామాజిక స్పృహ ఉన్ననూ, లేకున్ననూ రచనావసరాన సమకాలీన సామాజిక పరిస్థితులు అతని కవితను ప్రభావితం చేయకుండా ఉండలేవు. సామాజిక స్పృహ కూడా కవికి ఉంటే ఇంక ఆ కవిత అర్థవంతము, పరార్థవంతమూనై పరమార్థాన్ని సాధిస్తుంది సాహిత్య ప్రయోజనాన్ని సార్థకం చేస్తుంది. ఇలాంటి కవితలు, కావ్యాలు కాలం కడదాక మనగల్గుతాయి. సమకాలీన సామాజిక మనస్తత్వానికి, సంస్కృతీ సంప్రదాయాలకు, జనజీవన విధానానికి అద్దంపట్టే రీతిలో ఆవిర్భవించిన చక్కని ప్రబంధం అల్లసాని వారి మనుచరిత్ర. ప్రబంధ సాహిత్యం సామాన్యులకు దూరంగా. రాజాస్థానాలకు దగ్గరగా, సమాజానికి అందకుండా, ఊహాలోకాలను సృష్టించి, విశ్వశ్రేయస్సును విస్మరించిందనే అపవాదు బలంగా వినిపిస్తోంది. అయినప్పటికిని అనుశీలనం అమలినంగా కొనసాగిస్తే! అధ్యయనానికి 'గురి' ఉంటే ప్రబంధ సాహిత్యం కూడా సామాజిక జనజీవన స్పందనను సముచితమైన రీతిలో ప్రతిధ్వనింప చేసిందనే వాస్తవం ప్రత్యక్షం కాక మానదు.

పెద్దన్న సముజ్జ్వలమైన ప్రబంధ సాహిత్యానికి శ్రీకారం చుట్టిన కవీంద్రుడు. ప్రబంధ సాహిత్యంలో ఈయన వ్రాసిన మనుచరిత్ర ఆదిమ ప్రబంధమే కాదు, ఒక ఆణిముత్యం కూడా. రచనలో బిగువు, భావ ప్రకటనలో జిగిని సంతరించుకొన్న రచన యిది. రాయలనాటి ప్రజల సంస్కృతికి, సంప్రదాయాలకు అనుగుణంగా కథను మలచుకొంటూ మనుచరిత్ర ప్రబంధాన్ని, పెద్దన మహాకవి సృష్టించడం జరిగింది. మనుచరిత్రలో కన్పించు నాటి సమాజాన్ని ఆవిష్కరించే ప్రయత్నమే ప్రస్తుత వ్యాస లక్ష్యం.

విజయనగర సామ్రాజ్యాన్ని నాడు శ్రీకృష్ణదేవరాయలు దేవేంద్ర వైభవంతో ఏలుతున్నాడు. ఈయనకు ఖడ్గ బలం ఉంది. ఈయన మంత్రికి (తిమ్మరుసు) బుద్ధి బలం ఉంది. ఈ రెంటితో పాటు పుష్కలమైన క్షేత్రం తోడైంది. ఫలితంగా సమస్తాంధ్ర దేశం ఒకే గొడుగు క్రిందికి వచ్చింది. గజపతులు పాదాక్రాంతులైనారు. యవనులు తరిమి వేయబడ్డారు. అనేక దుర్గాలు వశమైనాయి. సిరిసంపదలకు కొరత లేదు. విజయ విశేషాలకు వెలితి లేదు. పాడిపంటలకు లోటు లేదు. కాలం కలసి వస్తోంది. ప్రజ కూడా పరిపూర్ణంగా బ్రతుకులు సాగిస్తున్నారు. దేశ విదేశ వర్తకులు, రాయ

తెలుగు లెక్చరర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, పెనుమూరు—517 126, చిత్తూరు జిల్లా

వాపటు వచ్చిపోతున్నారు. విభిన్న సంస్కృతీ సంప్రదాయాలు కలగా పులగమై విచిత్ర సంస్కృతి నాటి సమాజంలో పొడచూపుతోంది.

"ఒకప్పుడుం దరుగ దింటల బాడియుం బంటయున్," అతిధు లే తీర నడికి రేయైనఁ బెట్టు అని పెద్దన గారే అంటారు. కాలం కలసి వస్తోంది ప్రజ పరిపూర్ణ బ్రతుకులు సాగిస్తున్నారు. జీవితాన్ని ఆనందంగా అనుభవించడం జరుగుతోంది. ఈ ఆనందానికి కళలు తేనిచే సమాదరింప బడ్డాయి. కవితకు పెద్ద పీట వేయబడింది. భువన విజయమనే సాహితీ సభ రాయలచే ఏర్పాటు చేయబడింది. కవులకు గౌరవాదరాలు పెచ్చుపెరిగాయి.

కం॥ భువన విజయాఖ్య సంస
ద్భువన స్థిత సింహపీఠిఁ బ్రాజ్ఞుల గోష్ఠిం
గవితా మధురిమ డెందము
దవులం గొలువుండి సదయతన్ నన్నుఁ
బల్కెన్ (1–13)

అని పెద్దనగారు సెలవివ్వడం జరిగింది.

ఇలాంటి కాల పరిస్థితిలో రాయలవారి కోరిక పై పెద్దన మనుచరిత్రను వ్రాయడం జరిగింది. ప్రబంధ రచన నాటికే పెద్దనగారు 'ఆంధ్ర కవితా పితామహుడు' అని ప్రశస్తిని పొందారు. పాలకులు, పాలితులలో గల భోగలాలసతకు అనుగుణంగా ప్రబంధ కథను పెద్దన చిత్రించారు. ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలకు, నైతికమైన కట్టు బాట్లకు ప్రవరుడు ప్రతీక కాగా, సమకాలీన ప్రజల భోగవాలసతకు ప్రతీకగా వరూధినిని మలచుతూ కవి కథను సాగించడం విశేషం.

పెద్దన రాయలు హితుడు, చతురవచోనిధి, శిరీష కుసుమ పేశల సుధామయోక్తులు గాను (1–14వ) ఇటువంటి కవికి రాజు కర్పూర తాంబూలం పెట్టి ప్రబంధ రచనకు ప్రేరేపించడం జరిగింది. ఆ గుబాళింపే ప్రబంధమంతా నిండాంది.

వరూధిని ప్రవరుని 'భోగపరుడవై రమింపుము', ఎందే డెందము కందళింప రహిచే... ఎందే నింద్రియముల్ సుఖించఁగను నాయింపే పరబ్రహ్మ 'మానందో బ్రహ్మ' యటన్న ప్రాజ్ఞుడు' ఆంతర్యమును గ్రహించుమని చెప్తుంది విజానికిది పెద్దనగారి మాట. నాటి సంఘ ప్రజల మనోవాంఛితము. భోగపరాయణత్వం నాటి ప్రజలలో ప్రబలంగా కన్పిస్తోంది అందుకే కవి వేరే సందర్భంలో కూడా.

కం॥ వడిఁగాచికాచి యుండం
గడవలనీ రిను ము ద్రావు కైకడిఁ బైఁబైఁ
బొడమెడు కోర్కులచేఁబె
ల్లుడికిన మదిభోగముక్తి కూలటగనునే?

అని కోర్కెలచే ఉద్రేకించి యున్న మనసు భోగాలనే కోరుకుంటుంది, కాని భోగముక్తిని సహించదని ఉపమానాలంకార సహితంగా విశదం చేస్తారు. నాటి ప్రభువులు, ప్రజలు, భోగముక్తులుకారనే వాస్తవాన్ని చక్కగా స్పష్టం చేశారు.

ప్రవరుడు వరూధినిని చూచిన విధాన్ని చెప్తూ అందమైన ఉద్యానవనం అందు మనోహరమైన భవనం. దానిముందు తియ్య మామిడిచెట్టు,

ఆ చెట్టు పాదులో అరుగు, ఆ అరుగుపై చంద్రకావి పావడకట్టి, దానిపై నాణ్యమైన రవసెల్లా చుట్టి పైట వేసుకొని, వరూధిని కూర్చొంది. ఆమె ఎదపై వీణ. వీణా తంత్రులపై ఆమెలేత వ్రేళ్ళు. ఆ మనోహరవాతావరణంతో మైమరచి యుందట. ఇదంతా నాటి ప్రజలకళాహృదయాలకు ప్రతీక అనవచ్చును. విలాస జీవనులైన ప్రజల మనోభావాలే కవి కలం ద్వారా మరింత మనోజ్ఞత్వాన్ని సంతరించుకొన్నాయి. వరూధిని ప్రవరుని ప్రలోభ పెడ్తూ 'మృగమదం, జవ్వాజి, పచ్చకర్పూరం, పన్నీరు, పువ్వులు, పండ్లు వస్త్రాలు (2-55 ప) ఎన్నెన్నో విలాస వస్తువులను చెప్తుంది. ఇవన్నీ నాడు ప్రజలు విస్తృతంగా ఉపయోగించనిదే పెద్దనగారి దృష్టికి వచ్చేవి కావు. అందుకే నాటివారు భోగలాలసులని ఖచ్చితంగా చెప్పడం జరుగుతోంది. మరొకచోట మనోరమను పెనిమిటి దగ్గరకు పంపుతూ' తల స్నానం చేయించి, వెండ్రుకలకు అగరు ధూపం వేసి, జవ్వాజి మెఱుగుతో చిక్కుదీర్చి, కొప్పుపెట్టి, కొప్పుపై చెంగల్వ పూదండ నిల్పి జడబిళ్ళనమర్చి, కుంకుమపువ్వుతో అక్షింతలు బొట్టుపెట్టి, ముత్యాల మొలనూలును ధరింపచేసి, చంద్రకావి వరిగపు చీరకట్టి, ముత్యాలహారాన్ని కంఠాన అమర్చి, కాళ్ళకు అందియలు సంతరించి పంపినట్లు చెప్పడం జరిగింది ఇంతేకాకుండా 'మృగమద సౌరభ విభవ—ద్విగుణిత ఘనసార సాంద్రవీటి గంధ స్థగితేతర పరిమళమై ...' మిక్కిలి పరిమళవంతమైన కర్పూర వీడెమును కూడా కవి పలుమార్లు చెప్పియున్నాడు. ఇవన్నీ నాటి ప్రజల భోగలాలసతకే కాక, వారు పయోగించిన భోగవస్తువులు, వారాదరించిన సంస్కృతీ సంప్రదాయాలకు నిదర్శనంగా పేర్కొనవచ్చును. అనాడు చంద్రకావి పావడా, చీరలను ఎక్కువగ ఆదరించినట్లు స్పష్టపడుతోంది. అంతేకాక 'చీరలను అద్దకం ఉండనికూడా, తెలుస్తోంది.' అలకని జీబులో(గుసుమపుద్దిక పావడ వంటి వాక్యాలు ఇందుకు తార్కాణాలు

ముత్యాలహారాలు, బంగారు మొలనూలు, అందియలు, చెవి కమ్మలు, జెడ బిళ్ళ, ఉంగరం కడియాలు మొదలగు ఎన్నో ఆభరణాలను నాటి వారు సమాదరించారన్నారు. జడల కన్నా నాడు ముడులు ముడుచుకోవడం ఎక్కువగా కన్పిస్తోంది. కొప్పు, వక్షము, జఘనములు ముప్పేతులు ముదితకు అందంగా భావించా రనవచ్చును. చెంగల్వ పూదండలు, గులాబి పూవులు ఆ రసజ్ఞులను ఎక్కువగా ఆకర్షించాయి. వీణా నాదం స్త్రీకి అలంకారంగా భావించబడింది. మధ్యాహ్నం 'నాటరాగం"ను, ప్రభాత వేళ 'దేశాక్షి రాగం'ను వారు ఆదరించారు. సంగీత కళా రసజ్ఞతకు ఇవి పరమోదాహరణములు. భోగం వారు ఆట పాటలతో రసజ్ఞుల అభిమానాన్ని చూరగొన్నారు. రాజసభలలో నాట్యకళ ప్రత్యేకంగా గౌరవించబడింది, ఇట్లే భవనాలపై శిల్పచిత్రాలు మనోజ్ఞమైన తీరులో తీర్చిదిద్దబడ్డా కనుక రాయల కాలంలో సంగీత సాహిత్య నాట్య చిత్ర శిల్పాలైన లలిత కళలకు మర్యాదా మన్ననలు మిక్కిలిగా పెరిగాయని, ప్రజలు కళా హృదయులు గనుకనే ఇవి అంత సముచిత స్థానాన్ని సముపార్జించుకొన్నాయని చెప్పవచ్చును.

చాతుర్వర్ణ వ్యవస్థ ఆ నాడుంది. విప్రులు విద్యా సంపద తోడను, రాజులు బాహు విక్రమ విభవము తోడను, వైశ్యులు సకలైశ్వర్యముల తోడను, శూద్రులు వ్యవసాయంతో అనల్ప విభూతిని అంది పరిఢవిల్లినట్లును తెలుస్తోంది 'అచట పుట్టిన చివురు కొమ్మైనఁ జేవ' అన్న వాక్యం మిక్కిలి ఆలోచింపదగినది. క్షత్రి

యింకు జాతకర్మలు, వడుగు, ఆయుధవిద్యలు మరియు వేదార్థములందు శిక్షణ తప్పనిసరి. ఇంక అవకాశానికి అనుగుణంగా శృంగార రస సామ్రాజ్యాధి నేతలై భోగాలను పుష్కలంగా అనుభవించే వారు

ఇలా అని రాయల కాలంలో జనమంతా భోగ పరాయణులై విశృంఖలంగా వ్యవహరిస్తున్నారని చెప్ప తగదు. కొద్దిమంది ప్రాచీనతను వదలకుండా నైతిక కర్తవ్యంతో, నిష్ఠాగరిష్ఠులై జీవనాన్ని సాగిస్తున్నవారు లేకపోలేదు. ప్రవరుని వర్ణించు నప్పుడును, కథలో ఇతర సందర్భాలలోను పెద్దన ఈ విషయాన్ని స్పష్టం చేశాడు. భగవన్నామ స్మరణతో నిద్ర లేచి

సీ॥

సచ్ఛాత్రుడగుచు నిచ్చలు నేగి యయ్యేట
అఘమర్షణ స్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి, సావిత్రి
జపియించి, సైకతస్థలి కర్మసాక్షి కెఱఁగి
ఫల సమిత్కుశకుసుమాది– బహుపదార్థ
తతియు నుదికిన మడుగు దోవతులు గొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ

అని చెప్పడాన్ని బట్టి శిష్యులతో అఘమర్షణ సూక్తాన్ని పఠింపుచు స్నాన మాచరించి, సంధ్య వార్చి, గాయత్రీమంత్రాన్ని జపియించి, కర్మసాక్షికి నమస్కరించి పండ్లు, సమిధలు, దర్భలు, పువ్వులు, ఉదికిన మడుగు దోవతులు కొని యింటికి వచ్చేవారు. అరణుల నిప్పు రగిల్చి హవిస్సులో అగ్ని కార్యం దీర్చడం, శిష్యులకు వేద పాఠాలు బోధించడం మొదలగు సనాతన బ్రాహ్మణ సంప్రదాయాలను కవి మనోజ్ఞంగా వివరించాడు.

కాకుండా భోగలాలసులను వీరు వ్యతిరేకించేవారు. ఈ భోగాలు తుచ్ఛసుఖాలు, మీసాలపై తేనియలు వంటివని వారి అభిప్రాయం. వేదవిహితాచారములే పుణ్యప్రదం, పారమార్థిక సాధనమని వీరి నమ్మకం. త్రేతాగ్ని అను తపస్సు ఆరాధించి ముక్తి నందుటే వీరి లక్ష్యం. కాని వీరి సంఖ్య అల్పం. ఆధునిక మైన భోగాసక్తుల భావ ప్రవాహాన్ని వీరి అడ్డుకట్ట ఆపలేకపోయింది. అసలు తరతరాల సనాతన సంస్కృతీ సంప్రదాయాలలో పెరిగి పెద్దవాడైన పెద్దన్న గారు కూడా, మానసికమైన భావోద్రేకానికి లొంగి వరూధినీ పక్షపాతి అయినాడంటే యింక నాటి సామాజికుల మనోప్రవృత్తిని ఆపగలమా! శ్రీ దువ్వూరి వారు ఈ విషయాన్ని 'అల్లసాని పెద్దన సమకాలీన భావ ప్రతినిధి' అనే వ్యాసంలో చక్కగా వివరించారు. ఆ కవికోకిల మాటలు అక్షర సత్యాలు అనవచ్చును.

ఆనాటి వారికి అతిథి పూజ ప్రధానంగా ఉండేది. 'అభ్యాగత స్స్వయం విష్ణుః' అన్న ఆర్యోక్తిని పాటిస్తున్నట్లు తెలుస్తోంది. బ్రాహ్మణ పూజ వుండేది. ఆటవికులు కూడా నాగరికులను మంచిగా గౌరవించారు. ప్రభువులను, ప్రభుత్వాధి నేతలను వీరు నక్కకొమ్ము (ఇతరులను వశం చేసుకోవడానికి) తేనెపెర, బొఱపప్పు, ఉంపకోలలు సెలవిండ్లు మొదలైనవానిని కానుకలుగా అర్పించి గౌరవించారని తెలుస్తోంది. మను చరిత్రలో నాటి పల్లె జీవన విధానం కూడా కొంత వరకు తెలుస్తోంది. కొండల పైన, కొండ సాను ప్రదేశాలలోను పల్లెలుండేవి. సేద్యం బాగా చేసే వారు. అడవి పందులు, ఏనుగులు వీరి పంటలను పాడు చేస్తుండేవి. మాటు వేసి వాని బెడదను ఎదు ర్కొనేవారు. పండిన ధాన్యాన్ని తూర్పారబట్టేవారు

మన్ను తూర్పారబట్టి గాలివాటుం తేల్చుకొనేవారు. ధాన్యం మూటలను మోసుకొనేవారు. కోళ్ళు పశువులను పెంచుకొనేవారు. తొండపై పల్లెండు కృకవాకుల్ మొరసెన్' అని చెప్పడం జరిగింది. తంగేటి జున్ను వీరికి ఎక్కువ ఆదరపాత్రమైనట్లు కన్పిస్తోంది పశువులు పైరు తినకుండా "కృముల" మూతులకు బిగించేవారు. 'కావళ్ళ'తో బరువులు మోసేవారు. "త్రంపు" పెట్టి నీటని కాచుకొనేవారు. 'కావులు'తో ఆవిరి పట్టేవారు. పశువులను "బందెదొడ్ల" పెట్టేవారు. బాధలు అధికమైనప్పుడు అప్పులు చేసేవారు. ఇంకనూ ఆర్థికబాధ అధికమైన భూషణాలను సొమ్ములను "కుదువ" పెట్టేవారు (కుదువను నాడు "ఆహి" అన్నారు). ఇనుమును కాల్చడం—సమ్మెలు కొట్టడం, కొలుములు రగల్చడం ఉంది. కనుక వృత్తులు కూడా నిరాటంకంగా సాగుచున్నాయనాలి జట్టీలకుస్తీలున్నాయి. సంబరాలప్పుడు, సాముగరిడీలు, జట్టీలకుస్తీలు, భోగంవారి ఆటపాటలు సాగుతుండేవి.

స్త్రీలకు నోములు, వ్రతాలున్నాయి. కొన్ని నోములు ఫలితాన్నిస్తాయని నమ్మేవారు. తాత్కాలిక సుఖాలన్నపేక్షించువారు. "రాజవనలకాన్న" పడతాడని విశ్వసించేవారు. "అంజనం" కారణంగా నిధులను తెల్సుకొంటుండేవారు. దిక్కటములకు "కావిరి" (పొగవంటి నల్లదనం) క్రమ్మిన, మాలకాకులు అరచిన, నక్కలు కూసినను, అశుభంగా భావించేవారు. ఆనాటి పెండ్లిండ్ల ఆచారాలు సంప్రదాయాలు కూడా మనుచరిత్ర ప్రబంధం చక్కగా స్పష్టపరుస్తోంది. పెండ్లివారిరాక, అరుగు, పూలు పండ్లు, మొ॥ మంగళద్రవ్యాలు, జలకాలాడడం పెండ్లిరవిక, బ్రాహ్మణాశీస్సులు, మధుపర్క సమర్పణ, కన్యాదానము, తెరపట్టుట, తలంబ్రాలు పోయడం మంగళసూత్రధారణ, హోమము—లాజహోమము, సన్నికల్లు త్రొక్కించడం, కొంగులు ముడివేయడం, హోమాగ్నికి నమస్కారం చేయించడం, ధ్రువనక్షత్రాన్ని అరుంధతీ నక్షత్రాన్ని, దర్శింపచేయడం. బంధువుల కానుకలు, అరణమివ్వడం (కట్నాలు) గృహోపకరణాలు (కలాచి ఘటాదులు). రత్నభూషణ వస్త్రాదినివ్వడం (వధువుతల్లిదండ్రులు) అగరు, కస్తూరి, జవ్వాజి, పటీరం, పన్నీరు, తట్టుపునుగు అగరుసత్తు, మంచి గంధపుపొడి, బాదు (బొట్టు), ఉదయభాస్కరం, మొ॥ ద్రవ్యాలు (నేటి టాయిలెట్ సామగ్రి), పరిచారికాగణం మొ॥ సమస్తాన్ని కన్నవారు కూతునకివ్వడం ఉంది. మరియు పసుపుకుంకుమల క్రింద కొన్ని సంపదల నివ్వడం ఉంది. పెండ్లి పెద్దలకు కూడా కానుకలందించడం మొదలగు అనేక ఆచారాలను పెద్దనకవి గ్రంథస్థం చేయడం విశేషమనాలి. సామాజిక స్పృహ పూర్ణంగా ఉన్న కవి కనుకనే యింత విస్తృతంగా విషయాలను వివరించడం జరిగింది

పెద్దన మహాకవి పాలకుడైన శ్రీకృష్ణదేవరాయప్రభువును గూర్చి, ఆయన యుద్ధాలను గూర్చి, పరాక్రమాన్ని గూర్చి, విజయాలనుగూర్చి, చక్కగా వివరించారు. ఇంతకన్నా ఎక్కువగా మహాకవి ప్రభువులతో వేటకుపోయి యున్నందున వేట విశేషాలను సువిస్తారంగా తన ప్రబంధంలో అక్షరరూపం కల్పించడం జరిగింది. రాయలు కృష్ణాగోదావరీ నదులమధ్య దేశాన్ని ఆక్రమించినవాడని, ఉత్కళదేశాన్ని సునాయాసంగా సాధించినవాడని, అరిభయంకరుడై కలబరిగి

కటకరాజులను జయించాడని, హిందూ సామ్రాజ్య రక్షణకు బద్ధకంకణుడని, యవనదేశపు నవాబును శాసించాడని, కళింగరాజును జయించి, అతని కాంతలను చెఱలో ఉంచాడని తిరుమ దేవిని భార్యగా స్వీకరించాడని, కొండపల్లి, కొండవీటి దుర్గాలను వశపరచుకొన్నాడని, గజపతి గర్వాన్ని, అణచినాడని పీఠికలోని పద్యాలలో వివరించడం జరిగింది. మరియు రాయల వారి దాతృత్వాన్ని, పరాక్రమాన్ని, కవిపండిత జనాదరణను బుద్ధి విశేషాన్ని, కళాహృదయాన్ని, సంస్తుతించడం కూడా జరిగింది.

పెద్దన స్వారోచి వేట నెపంతో నాటి రాయల వారి వేటకార్యక్రమాన్ని పాఠకునకు ప్రత్యక్షం కావించడం జరిగింది.

అడవి పందులు, దుప్పులు, జింకలు, ఉడుములు, ఎలుకలు, పిచ్చుకలు, తొండలు, తోడేళ్ళు, పులులు, సివంగులు, కారుదున్నలు, సవర మృగాలు, జంగుబిల్లులు, ఋష్య మృగాలను వేటాడేవారు. కుక్కలను ఉసిగొల్పి వేటాడడం. బాణ ప్రయోగాలు, మొలపిడి యమ్ముతో పొడవడం మొ॥వి మనకు కన్పిస్తాయి. ఇనుప ముళ్ళతో కూడిన చెక్కజింకలను చేసి, ఉచ్చును కల్గించి, అందు ఉచ్చును రహస్యంగా ఉంచేవారు. జింకలు భ్రమతో ఎదిరింపవచ్చి, కొమ్ములు ఉచ్చులో తగుల్కొనుటతో బందీలయ్యేవి. పక్షులను వేటాడడానికి ఒక చేతిలో కర్రను, మరో చేతిలో డేగను ఉంచుకొని పోయే వారు బోనులను ఉపయోగించారు. హస్తకవచం, మాంసపు దండలు కల్గిన గడలు, పరిసెనము (డేగకుచురుకుదనాన్ని కల్గించే ప్రక్రియ) కట్టుతాళ్ళు, వేటగాండ్రకు తప్పని సరి. చిలుకలు, గోర్వంకలు, పావురాలు వేటకు అవసరం. వేటకుక్కలకు మెడలో గంటలు, తోలుపట్టెడలుండేవట. పర్షియా దేశంలో తయారైన 'కలాచిరంత్రి' ఎక్కువగా వాడేవారు. వేటగాండ్రు తలపాగలు ధరించి, చల్లడములు సంతరించుకొని, దట్టీలు కట్టుకొని, దట్టీలలో పిడి బాకులు దోపుకొని, డేగలతో వేటకు సిద్ధమై పోయేవారు (4-29, 30).

> శా॥ పులియుడు బూచిగాడు నరపోతుల
> రాజునుమంత్రిగాడు చెం
> గలువ సివంగి భైరవుడు గత్తెర సంపగి
> వెండి గుండు మ
> ల్లెల గుది వాయువేగి చిటిలింగడు పాళ్వడు
> వత్సనాభియే
> కలముల మిత్తి గబ్బియనగా గలవాని
> గ్రహించి యుద్ధతిన్ (4-32)

అని పలురకాలైన వేట కుక్కలతో వేటకు పోయినట్లు చెప్పడం జరిగింది ముసలబోయీలు పందులను బట్టే వలలను పట్టుకొని మంచి హుషారుగా. అడవులకు పోతుండేవారు మగ ఆడు జింకల సయ్యాటలు, చీమలకై పుట్టలను చీల్చు ఎలుగు గొడ్లు, పాములను పట్టి తిను దుప్పులు. అడవిదున్నల పోరాటాలు, తోడేళ్ళ తాపులు. వీనిని తరిమే అడవికుక్కలు బెబ్బులుల ఘీంకారాలు, కాలిబోనులలో యిరికి వదిలించుకో లేని ఋశ్యమృగాలు కొండ గొఱ్ఱెల రక్తాన్ని పీల్చే చిరుతపులులు, వెదురు ధాన్యాన్ని తింటూ పంటలను నాశమొందించు అడవి యేనుగు తో అడవులు అలరుతుండేవట. అప్పుడు దొడ్డి వల పన్ని, ఏగువ పొలిమేరలో దూరంగా పోగు తాకు కట్టించి, అడ్డువలలు ఎత్తించి వలలు చుట్టును సమర్థులైనబోయలను నిల్పి, వారి వెనుక వేట

కుక్కలతో ఉరుతొడ్డి వేటాడే వేట గాండ్రను నియమించి, అడ్డు వలకు లొంగిన వానిని అక్కడి కక్కడే పడగొట్టించేవారు. కొండలపై వేటాడే జనాన్ని ఎక్కించి, దారులను మూసేవారు. సదుల అప్రమత్తతగావించే వారు. దాగిన జంతువులను బయటకు రప్పించడానికి మద్దెల, దుందుభి మొ॥న వాయిద్యాలధ్వనులతో కల్లోల పరచి పట్టుకొనేవారు. మారువేషాలతో మాటు వేసి సూకర సముదాయాన్ని నేలకూల్చేవారు. చిన్న కుక్కలతో ఉడుములను వేటాడేవారు. పోయిన జాడను తెల్సుకొనిపోయి మూర్ఛ పందిని పంట్ర కోల (అలుగు తిక్కువగల ఇనుపకఱ్ఱ)తో పొడిచి చంపేవారు.

ఇంక డేగవేటలో 'సాళువమనే డేగ కుందేటిని, 'సెలకట్టి' అనుడేగ చెమరు కాకిని, 'అజుజు' అనే డేగ పావురాయి, 'ఓరణ' మనే డేగ కల్జేటి పక్షిని,తో' చిగాడనేడేగ పూరేడును, 'జాలె' అనే డేగ లేతుకను, 'నేనగుమనే' డేగ రైజా పక్షిని, లగుడనే డేగ కొంగలను వేటాడి పట్టినట్లు తెలుస్తోంది. (4–58).

వేటానంతర కార్యక్రమాలు కూడా పెద్దన కవితలో కన్పిస్తున్నాయి. వేట అనంతరం చంపిన జంతువులను ఒక్కచోటునకు చేర్చేవారు. వాని తోళ్ళను దీసి, మాంసపు తునకలను ఏర్పరచేవారు. పులుల మీసాలను కాల్చేవారు. ఏనుగు కొమ్ములను, అందున్న ముత్తెములను సంగ్రహించేవారు. గోరోచనం, చమరవాలములను, నెమలి పురులను భద్రపరిచేవారు. ఆ తరువాత సెలయేళ్ళదరి వృక్షాలనీడకు చేరుకునేవారు. గరువునేలలో గుంటలు చేసి, అందు ఆవిరిపట్టి, కంపులేకుండా ఆపురాకులను పరచి. మంచి మాంసాన్ని ఏరి, కార్జ్యము, కందనకాయ (గుండె) క్రొవ్వు మొ॥ వాని మొత్తాన్ని ఆ గుంటలో నిండుగా క్రుక్కి కందగం చింత కాయలనంతా పై పరచి, ఎసరుగా కుండల నిండుగా ఉన్న తేడి నల్లను (నెత్తురు) పోసి, ఉప్పును సరిపడవేసి, కావు కప్పేవారు. ఇంక పైన సీరాయినేయి పిడకలను దెచ్చి, కావుపై పేర్చి, నెల్లి కొయ్యలు, మేక పెంటికలు కలిపి రగిలించి, మండించి, మెత్తబడు వరకును ఉడికించేవారు. ఆ తరువాత కణకణమందే నిప్పులలో 'కర కుట్లు' కాల్చడం, చట్రాతిపై పెట్టి ముందు క్రాతేనికి (శివునకు) ని వేదించడం చేసేవారు. అనంతరం సమపాళ్ళలో విభజించుకొని వేటలో పాల్గొన్న వారందరునూ భుజించేవారు. తియ్యని నీళ్ళు త్రాగి విశ్రమించేవారు. మేలైన మాంసాన్ని పండ్లను రాజునకు అందించినట్లు కూడా చెప్పబడింది. మిగిలిన మాంసాన్ని కావిళ్ళతో మోసినట్లు స్పష్టపడుతోంది. పెద్దన కవికి గల లోకపరిశీలనా దార్ఢ్యతకు ఈ సన్నివేశాలు పరమోదాహరణలు. ఇంతటి విశాల దృక్పథం కలవాడు గనుకే బిరుదైన గండ పెండేరమునకు తానే తగినవాడై ఆంధ్రకవితా పితామహుడాయెనన వచ్చును.

మనుచరిత్ర 5వ ఆశ్వాసంలో 15,16 పద్యాలలో పెద్దన వైద్యశాస్త్ర విజయాలను ప్రస్తావించడం జరిగింది. కాయ, బాలగ్రహ, ఊర్ధ్వాంగ శల్య, దంష్ట్రి, జరా, వృషలనే ఎనిమిది చికిత్సలను వివరించడం జరిగింది. ఇబులనే రుచిహీనత వలన కలుగు దోషములు, తత్సంబంధ ఔషధాలను కవి ప్రవచించడం గమనార్హం. ఆనాడు ప్రజలు కుంకుమ, సంపెంగ, మల్లె, చేమంతి, దాసాని ఇప్ప, మొగలి, గులాబి, జాజి, సురపొన్న మొదలైన పూల చెట్లను, అశోకము, గోరంట,

రక్తాశోకం మొదలైన ఇతర చెట్లను, కలువ, తామర మొదలైన నీటి పూలను సమాదరించినట్లు కూడ స్పష్ట పడుతుంది. (3–11,28,73 ప॥లు) పక్షులలో చాతకములు, కోయిలలు, చిలుకలు, గోర్వంకలు, పావురములు. కాటుక పిట్టలు మొ॥ నాటి జనుల ఆదరాభిమానాలను చూఱగొన్నాయన వచ్చును. (3–19,58) పెర్షియా దేశంలో ముత్యాల నగిషి పని చేయించు కొని ధరించినట్లు చీనా దేశపు పట్టువస్త్రాల ప్రత్యేకతలు గుర్తించినట్లు కూడా తెలుస్తోంది. ఇట్లే ప్రేపసెజ్జలు, దంతపు బరిణలు కూడా వాడు చుండిరి. (1–78)

ఈ విధంగా ఆంధ్ర కవితా పితామహుడు సమకాలీన సమాజపు రుచికి, అభిరుచికిని తగిన రీతిలో ప్రబంధమనే వినూత్న, సాహిత్య ప్రక్రియను అందించడమే కాక, రాయల నాటి ప్రజల మనోభావాలను అద్దం పట్టారని చెప్పవచ్చును కేవలం మనోభావాలే కాదు సంస్కృతీ సంప్రదాయాలు, సాంఘిక జీవన పరిస్థితులు, ఆచార వ్యవహారాలు, ఉపయోగించిన వస్తు సామగ్రిని, శాస్త్ర జ్ఞానాన్ని, సకలాన్ని, సమున్నతంగా అందించి, మను చరిత్రఅనే అద్దంలో నాటి సమాజాన్ని చాలవరకు దర్శింపచేశారని చెప్ప వచ్చును.

# కవిత్వము– విమర్శ

— కీ॥ శే॥ సర్దేశాయి తిరుమలరావు

(11–5–94 తేదీన తిరుమ రావుగారి మరణం సాహితీలోకానికి తీరనిలోటు. వారుమహా పండితులు. వారి ఉత్తరాలు సుదీర్ఘంగా వ్యాసాల్లా వుంటాయి. శివభారత దర్శనం, కన్యాశుల్కం నాటకకళ వంటి బృహద్గ్రంధాలు వారి పాండిత్యానికి నిదర్శనాలు. వారు రాసిన అముద్రిత రచన నుండి కూర్చబడినది) శివలింగం

కవి కొత్తపుంత తనకుతానే తొక్కి- ఉంటాడని అనుకోవడం సమగ్ర వివరాలను తెలుసు కోకపోవడమే. ఒక్క కవి అంటాడు.

*No bird has ever uttered a note*
*That was not in some first birds throat*
*Since Edens freshness and mans fall*
*No rose has been original.*

దీన్ని బట్టి తేలేదేమిటి : ఎవరూ కూడా సంపూర్తిగా మూల పురుషులు కారు అని. గురజాడ రచనలు కొన్ని విశ్వసాహిత్యపు కోవలోకి చేరతాయి. రాయప్రోలు కవిత్వం ఎంత మృధువైనదయినా దాని కాయోగ్యత లేదనే నా విశ్వాసం. గురజాడ రాసింది జీవద్భాష. భావకవితా రచయితలు రాయప్రోలు నుంచి సోమసుందర్ వరకూ *bookish language* వాడారు. కవిత్వంలో రెండు అంశాలుంటాయి. *form* రూపం, వస్తువు (*content*) రెంటికి అభేదత్వం అబ్బినప్పుడే అది నిజమైన కవిత్వం అవుతుంది. వాల్మీకి శ్లోకానికి హృదయమే ప్రేరకం. గురజాడ కన్యాశుల్కానికి ఆయన హృదయంలోని అనుకంపే ప్రధానం ఎలా చెప్పారన్నది మేధా సంబంధి అంటాను. ఎందుకంటే ఎలా చెప్పాలనే దాంట్లో, భావన, ఆలోచన, క్రాంతదృష్టి, ప్రణాళిక, సమ్మేళన శక్తి మొదలైన అంశాలుంటాయి. సునాయాసంగా కవిత్వం చెప్పే వాల్మీకి కూడా ఎంతో ఆలోచించి కవిత్వం చెప్పే విధానంలో మేధా శక్తిని ఉపయోగిస్తాడు. హనుమంతుడు వెన్నెల రాత్రిలో లంకలో దిగిన వెంటనే ఉండే శ్లోకం చదవండి, మధువనంలో కోతులు చేసిన అగడపు శ్లోకాలు చదవండి. ఎంత *design* (ప్రణాళిక) వుందో తెలుస్తుంది. ఇదంతా మేధాసంబంధి. కళలో ఇది శిల్పం. ఇది వస్తువు అని అనుకోవడం విశ్లేషణ దృష్టి. కాని కళ మహాసమ్మేళనం అనే విషయం మరచిపోరాదు. 'బాల్య వివాహం చేయరాదు చేసిన వారికి శిక్ష విధించబడును. అనే ప్రభుత్వ చట్టంలో రూపం మాత్రం వుంది. వీరేశలింగం ప్రహసనాల్లో రూపం, వస్తువు విడివిడిగా కనబడతాయి. గురజాడ కన్యాశుల్కంలో రూపం, వస్తువు అభేదంగా పర్యవసించాయి. ఉత్తమకళలో రూపం, వస్తువు అభేదంగా వుంటాయి. మధ్యమకళలో రెండూ మిశ్రమంగా వుంటాయి.

చల్లపల్లి–521126, కృష్ణా జిల్లా.

కవిత్వ తత్వాన్ని గురించి చర్చించి చర్చించి ఆలంకారిక మతాలన్నీ పాక్షిక సత్యాలనీ బూటకాలన్నీ అనే నిర్ణయానికి వచ్చాను.

కవిత్వం అంటే ఏమిటో ఒక కొత్త నిర్వచనంచేయ ప్రయత్నించినాను. అభిధ లక్షణ వ్యంజనాది సాంకేతిక పదాలు మీకు తెలుసు. ఆలంకారిక సిద్ధాంతములన్నీ రెండు వృత్తులమీద ఆధారపడినట్టివి. నేను అభిధలోనే గొప్పకవిత్వం వుంటుందనే భావం కలవాణ్ణి, ఈ విషయం మీద నాకూ గుంటూరు శేషేంద్ర శర్మకూ భేదాభిప్రాయాలున్నాయి. ఆయన అభిధను తిట్టి తిట్టి కడకు గొప్ప కవిత్వానికి రామాయణంలోని జీవన్ భద్రాణి పశ్యతి 'అనే ఉదాహరణం యిచ్చాడు కవిసేన మేనిఫెస్టోలో. ఇది అభిధకాదా అనడిగాను. ప్రత్యుత్తరం లేదు. ఎక్కడెక్కడ గొప్ప కవిత్వం వుందో అది అభిధలోనేవుంది. చూడండి. ఈ చమత్కారాలు చమత్కృతియాలూ ఎందుకూ? ఈ దృష్టితోనే నేను ఆలంకారిక సిద్ధాంతాల్ని అవహేళన చేసింది. ఈ ఆలంకారికులు మహర్షులా మహాకవులా? అతి గొప్ప ధ్వని సిద్ధాంతాన్ని వివేకశాలురు దుయ్యబట్టలేదా? ఆశ నిరాశాది ద్వంద్వాలు జీవితంలో వున్నట్లే కావ్యంలోనూ వుంటాయి. గొప్ప కవిత్వ చరమాశయం మానవ హృదయ గుహలో ఆశాజ్యోతిని వెలిగించాలి. నా కన్యాశుల్క నాటకకథను పై వాక్యంతోనే ముగించాను. జీవన్ భద్రాణి పశ్యతినే తీసికోండి. భవిష్యద్ బ్రహ్మ, చిరంజీవి బజరంగబలి అయిన హనుమంతునికి జీవితం మీద ఆశపోతుంది. చావాలనుకుంటాడు. కాని వాల్మీకి కవి వద్దు బాబో వద్దు చావవద్దు మంచి కలుగుతుంది అంటాడు. ఈ విషయం శేషేంద్ర తన మేనిఫెస్టోలో చక్కగా పట్టించాడు హనుమంతునితో అనిపిస్తాడు ఎవరి కోసం? భవిష్యత్తులో వచ్చే నాకోసం మీకోసం శోక భయ స్థానాల్లో క్రుంగిపోయే అసంఖ్యాక ప్రజల కోసం! ఎచట నిరాశ, దౌర్భాగ్యం వర్ణించబడి ఉంటాయో అవే గొప్ప కవితలు. రామాయణ, భారత భాగవతాలు తుది పుటవరకు చదివితే ఒక అనిర్వచనీయమైన *pathos* అవతిస్తుంది. దాని వెంటనే ఒక *hope* వస్తుంది. హామ్లెట్, ప్రొమీథియస్ బేండ్, ఇలియడ్, పారడైజ్‌లాస్ట్, ఏంటిగన్ (ఇవి ప్రాశ్చాత్య దేశాల సార్వకాలిక రచనలు) వంటివి చదివితే *pathos*—*hope* కలుగుతాయి. తాను కాలిన బూడిదనుంచే ఫోనిక్స్ అనే పక్షి ప్రాణంతో లేస్తుందట. అట్లే నిరాశ నుంచే ఆశ వస్తుంది. అందుకే కన్యాశుల్క నాటకం అంతగొప్పది అని నా అభిప్రాయం మాలపల్లి, మాబాబు, మాతృగీతాలు అందుకే ఆధునికాంధ్ర సాహిత్యంలో అణిముత్యాలు. ఫ్రెంచి కవి బాధలేర్ దుష్ట పుష్పాలు కల కవిత. వున్నది కావని పంక్తుల సందుల్లో ఆశ. ఉత్సాహం తొంగి చూస్తుంటాయి. ఆస్కార్‌వైల్డ్ వ్రాసిన డిప్రొఫండిస్ అట్టిదే వాల్మీకి శోకమే శ్లోకమయిందనే ఆనందవర్ధనుని వాక్యం మననీయం.

సౌందర్య తత్వం — ప్రవృత్తిలోనైనా సరే సాహిత్యంలోనైనాసరే—ఏమిటి? ఒకసారి సుందరంగా వుండేది మరొకసారి వికారంగా ఎందుకుంటుంది? దీని అధిభౌతిక, రసాత్మక, మానసిక

విశ్లేషణాత్మక ప్రాతిపదికలేవి అనేదే నా విచారం. సౌందర్యం అనేది ఆత్మాశ్రయమా వస్త్వాశ్రయమా ఏదైనా సౌందర్య లక్షణాలేవి? ఆ లక్షణాలు బాహ్యాలా, అంతరాలా? సౌందర్యం అనే భావన మంచిదా చెడ్డదా అంటే *value judgement* అన్న మాట. సత్యం, శివం, సుందరం అనే నివాదమే వుంది. ఏమిటి దాని అర్థం? సత్యం అశివంగానూ, వికారంగానూ ఉండవచ్చా. శివం అసత్యంగాను వికారంగానూ ఉండవచ్చా? సుందరం అసత్యంగాను అశివంగాను వుండవచ్చా? లేదా ఈ మూడు కలిసి పోయిన ఒకానొక స్థితిని విశ్లేషించి మూడు భాగాలుగా పేర్కొంటున్నామా? కావ్యం మనకు నచ్చుతుంది. ఎందుకంటే అది బాగుంది అంటాం. అందులో బాగున్నదేది? రసం, అలంకారం, రీతి, గుణం చమత్కారం, వక్రోక్తి ఔచితి ఇట్టి లక్షణాలేవో ఉన్నాయంటాం. మాధ్యూ ఆర్నాల్డు మాధుర్యం ఉండాలంటాడు. వాల్టర్ పాటర్ సౌందర్యం వుండాలంటాడు. మనవాళ్ళు అలంకారశాస్త్ర మని అన్నారో దానిని ఆధునిక పాశ్చాత్యులు *Aesthetics* అంటారు. వికారంగా వుండేదాన్ని సుందరం అని ఎట్లా అనగలం? శూర్పణఖ వర్ణనను సుందరం అనగలమా? ముప్పాళ రంగనాయకమ్మ గారు అన్నారు. కావ్యానికి జీవితానికి సయోధ్యత లేదా? ఎందుకంటే జీవితంలో ఘోరమైన వాటివర్ణన కావ్యాల్లో చదివి ఆనందిస్తాం కానీ ఉత్తర రామ చరితంలో గత చరిత్ర యొక్క చిత్రపటాలు చూచి సీతా దేవి మూర్ఛిల్లుతుంది సీతాదేవికి కళాపిపాస లేదా? సౌందర్యమూ వికారమూ ఒకే నాణెపు బొమ్మా బొరుసులా? వికటము అనే పదానికి సుందరమైంది వికారమైంది అనే రెండర్థాలున్నాయి సౌందర్యం అనే వస్త్వాశ్రయమా, వ్యక్త్యాశ్రయమా? ఈ ప్రశ్న రస చర్చలోని రసం సామాజిక నిష్టమా? పాత్ర నిష్టమా? అనే దాని లాపుంది.

ఒక గులాబి వుంది మారుమూల అడవిలో ఎక్కడో పెరుగుతుంది. ఎండి పోతుంది. దానికి సౌందర్యం ఉన్నట్లు లేనట్లు? నిన్నెవరూ చూడరే అని ఒక కవి థామస్ గ్రే వాపోతాడు. సౌందర్యం మనిషి నిర్మించుకున్న ఒక క్రియమా? విలువా? లేక ప్రకృతి సిద్ధమైన గుణమా? పాశ్చాత్యులు. *Truth, good ness and Beauty* అని ఒక్క గుక్కలో అంటూంటారు. మనవాళ్ళు సత్యం శివం సుందరం అని అంటూంటారు. ఇది మన శాస్త్రాల్లో ఎచ్చటుంది?

సౌందర్యలహరి ఉంది కదా: అందులో వున్న సౌందర్య తత్వమేమో చెబుతారా? రమణీయార్థ ప్రతి పాదక శబ్దః కావ్యం అన్నారు. రామణీయకత అంటే ఏమిటి? రమ్యం జుగుప్సితం.... (దశరూపకం) రమ్యం అంటే ఏమి?

భౌతిక శాస్త్రంకు సంపూర్ణ ప్రమాణాలు లేవనుట స్పష్టం. రసం, ధ్వని. అలంకారం మొదలైన కావ్యాను శీలనానికి పనికి వచ్చే. అంశాలే కాని ప్రమాణాలు కావు. కావ్యం స్వతః ప్రమాణం. కవి ప్రమాదాలను తానే నిర్ణయించుకుంటాడు. సాలీడు తన జఠరంలోని రసంతో తంతువులు చేసి గూడు కట్టుకుని ఒక మూల కసి కనపడునట్లు కవి తను అల్లిన ప్రమాణాలలో కావ్యం దాగి వుంటుంది. సాహిత్య విమర్శవల్ల కావ్య నిక్షిప్త ప్రమాణాలు కవితా ప్రకాశికలు బయట పడతాయి. కాల దేశ పాత్రములు మారినా అభిరుచులు మారినా గొప్ప కావ్యములకు కొన్ని సమాన లక్షణాలుంటాయి. నేను సౌందర్యం అనే విషయం పై పెద్ద వ్యాసాన్ని వ్రాశాను. భారతిలో వచ్చింది. కవిత్వం హృదయ సంబంధి. కానీ ఆధునిక శాస్త్ర దృష్టితో చూస్తే అన్ని విధాలయిన *conceious activities* కు మేధస్సే మూలం. రాగద్వేషాలు

పుట్టు కొచ్చినప్పుడు సీతా పరిత్యాగ ఘట్టం చదివినప్పుడు మన గుండె కొట్టుకొని వేం పుంజు కున్నందున కవిత్వం హృదయ సంబంధి అన్న భ్రాంతి కలుగుతుంది అలా కొట్టుకోమని చెప్పేది మేధయే కనుక కవిత్వం కూడా మేధకే చెందుతుంది.

యుగకర్త అనే ఆలోచనా ధోరణి సరయినది కాదని నా అభిప్రాయం. రాయప్రోలు కవిత్వం కాలాతీతం. రాయప్రోలు రొమాంటిస్టు, గురజాడ రియలిస్టు. రాయప్రోలు కవిత్వం మధ్యతరగతి మర్యాదకి చెందింది. గురజాడ పతితులకి చెందింది. రాయప్రోలు కవిత్వంలో ధ్యేయంలేదు (ఉండాలని నా అభిప్రాయం కాదు) గురజాడ కవిత్వంలో ధ్యేయం వుంది. ఆనాటి కది రిఫార్మ్, నేటి పరిభాషలో సమసమాజం. రాయప్రోలు సంస్కార భాషనే తెచ్చాడు. గురజాడ సహజభాషను తెచ్చాడు. రాయప్రోలు దేశభక్తి ప్రాంతీయం. భౌగోళికం. గురజాడ దేశభక్తి విశ్వగీతి, మానవ గీత. విట్మన్ *Song of man* వంటిది, రాయప్రోలు కూడా గురజాడవల్ల ప్రభావితుడైనవాడే. కథలోగానీ గేయంలో గానీ నాటకంలో గానీ ఆధునికతకు గురజాడే ఆద్యుడు.

రాయప్రోలు అమలిన శృంగారంకాని, బాపిరాజు శశికళ కాని, కృష్ణశాస్త్రి ఊర్వశి కాని దిగుమతి సరుకులే సుమా! భౌతిక ఆధారం లేని శృంగారం ఉండదు. కృష్ణపక్షం ఊర్వశి రోజుల్లో కృష్ణశాస్త్రి పుంలింగం. ఊహా ప్రేయసి స్త్రీలింగం. కృష్ణశాస్త్రి శ్రీవైష్ణవం మోజులో పడ్డ తర్వాత ఆయనలో లింగమార్పిడి జరిగింది. భగవంతుడు నాయకుడు. తాను నాయిక మీరాబాయి ప్రకారం సృష్టిలోని ప్రాణులంతా నాయికలు శ్రీకృష్ణు డొక్కడే నాయకుడు ఇదంతా ఆదేదో మధురభక్తి యట. నమ్మాళ్వారు ఇట్టి భక్తితో వ్రాసినారట. సూఫీల భక్తి మన ఆళ్వారుల భక్తిని పోలుతుంది చైతన్య మహా ప్రభు భక్తిని పోలుతుంది. సూఫీజం (ఇనాయత్‌ఖాన్, జలాలుద్దీన్‌రూమీ) లో భక్తుడు పుంలింగం భగవంతుడు స్త్రీ లింగం అట. మధుసూదన సరస్వతి కూడా మధుర భక్తిని గూర్చి వ్రాశాడు భగవంతునిపై ఆరోపితమైన శృంగారం అమలినమనీ, మానవపరమైన శృంగారం మలినమనుకోవాలా? గార్హస్థ్య శృంగారం ధర్మార్థ కామ మోక్షాలకు దారియని మన శాస్త్రాలు చెబుతాయి. ఇవి నమ్మేవాళ్ళకే లేదు. మనస్సు చేత వాక్కుచేత కర్మచేత కలుషితం కాని శృంగారాన్ని రాయప్రోలాదులు ఎందుకు వెలగ బెట్టలేదు?

శృంగారం అనుభవాత్మకమయితే అమలినం ఎట్లా అవుతుంది? అందుకే *physical basis* లేనిది శృంగారమే లేదంటున్నాను. డాంటే కవికి బియాట్రెస్ ఫిజికల్ బేసిస్. శూన్యాన్ని ప్రేమించే వాళ్లు బౌద్ధులు. గార్హస్థ్యంలోని శృంగారం అమలినం అని గృహ పరిధిని దాటిన శృంగారం మలినమని ఔపయోగిక నిర్వచనం చేసుకుంటే సరిపోతుంది. *Love thy neighbour*ను కొంచెం విస్తరించి *love thy neighbours wife* చేయకూడదు. అదీ పరిధి. ఆలోచన కందనిదీ హేతువాదానికందనిదీ దేన్నయినా త్యజించాలి. ఆచారత్రయం కూడా హేతు వాదాలతోనే తత్వ వివేచన చేశారు. అనుభవం. హేతువాదం అనేవి మార్గదర్శక సూత్రాలుగా ఉండాలి.

# చలం జీవితం – ఆధ్యాత్మికత

డా॥ డి. ప్రభాకరరావు

ధర్మ శాస్త్రాలకీ, వేదాలకీ, ఉపనిషత్తులకీ ఆలవాలమైన భారతీయ సంస్కృతిలో చలం జన్మించాడు. చలం సరిగ్గా బుద్ధుడు పుట్టినరోజునే అంటే 18–5–1884న మద్రాసులో జన్మించాడు. చలం పూర్వీకులు 'గంగరాజు' వంశానికి చెందిన సగోత్రీకులైన నియోగులు. చలం తల్లిదండ్రులు నిష్ఠకల్గిన సనాతన సాంప్రదాయ భావాలు కల్గిన వారు కాకపోవటం వల్ల చలంపై వారి ప్రభావం అంతగా లేదని చెప్పవచ్చు. చలం చిన్నతనంలోనే తన తాతగారైన గుడిపాటి వెంకట సుబ్బయ్య గారికి పరిషంఢుడుగా వెళ్ళాడు. చలానికి బాల్యం లోనే ఉపనయనం జరిగింది. సంధ్యావందనం, జపతపాలు మొదలైన వాటిని నిష్ఠతో ఆచరించాడు. ఆ పట్టుదలతోనే రామాయణ, భారత, భాగవతాలను ఇతర ఆధ్యాత్మిక గ్రంథాలను చిన్నవయస్సు లోనే చదివాడు. యుక్త వయస్సు వచ్చేసరికి వివిధ మతగ్రంథాలను చలం చదివి వాటిని హేతు వాద దృష్టితో తర్కించటం మొదలు పెట్టాడు.

చలం స్కూల్‌ఫైనల్ చదువుతున్న రోజులలో ఆయన జీవితంలో కొన్ని సంఘటనలు చోటు చేసుకొన్నాయి. అవి 1911లో రంగనాయకమ్మతో చలానికి వివాహం జరగటం, ఆ తర్వాత కొద్ది రోజులకే తను కాకినాడ కళాశాలలో ప్రవేశించి, ఆ కళాశాల ప్రిన్సిపాల్ మహర్షి వెంకటరత్నం నాయుడిగారి స్ఫూర్తితో 'బ్రహ్మసమాజం'లో చేరటం జరిగింది. అందుకే చలం నాయుడి గారిని గురించి తన స్వీయచరిత్రలో ఇలా అంటాడు. 'రఘుపతి వెంకటరత్నం నాయుడు గారంటే నాకు భక్తి, ప్రేమ, గౌరవం. ఆయనవల్ల నా జీవితం నైతికంగా ఆధ్యాత్మికంగా చాలా ఇన్‌ఫ్లూయన్స్ అయింది' దీనివల్లనే ఆయన హిందూ సమాజంలోని సనాతనాచారాలను ఖండించి ఏకేశ్వరోపాసనకు కట్టుబడ్డాడు.

చలానికి అయిదుగురు సంతానం. ఆధ్యాత్మిక విషయాల్లో చలంపై తన తండ్రి ప్రభావం ఎంత వరకు ఉందో, చలం ప్రభావం కూడ తన పిల్లలపై అంతే ఉందని చెప్పవచ్చు. అంటే పిల్లలకు పూర్తి స్వేచ్ఛా, స్వాతంత్ర్యం ఇచ్చి వారితో ఒక స్నేహితునిగా ప్రవర్తించేవాడు చలం. దీన్ని బట్టి చిన్నతనంలో చలం అభ్యసించిన ఆధ్యాత్మిక భావాలు, తన పిల్లల్లో ఏమాత్రం లేవనే చెప్పవచ్చు. అయితే

యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు, గచ్చిబౌలి, హైదరాబాదు–500 134.

ఆయన కుమార్తె సౌరిస్ మాత్రం ఈశ్వర సాక్షాత్కారం పొందింది.

బ్రహ్మ సమాజ సిద్ధాంతాలకు, వాటి కార్యక్రమాలకు ఆంధ్రదేశంలో ఖ్యాతి లభిస్తున్న రోజులవి. చలం బ్రహ్మ సమాజ కార్యక్రమాలలో పగలు రాత్రి నిద్రాహారాలు లేకుండా నిర్విరామంగా సేవ చేస్తున్నాడు. ఆ సమయంలో చలం పెద్దకుమారుడైన రవి వ్యాధి గ్రస్తుడవటం జరిగింది. రవి అంటే చలానికి ఎంతో యిష్టం. ఎందుకంటే చలం విశ్వకవి రవీంద్రుని సాహిత్యాన్ని చదివి, ఆ సాహిత్యానికి ఆకర్షింపబడి తన మొదటి సంతానమైన కుమారునికి 'రవి' అని పేరు పెట్టుకోవడం జరిగింది. అయితే రవి ఏడవ యేటనే మరణించాడు. రవి మరణంతో చలం జీవితం అంధాతమస మయింది అప్పుడే ఆయన దేవుడు లేడంటూ నాస్తికుడుగా మారాడు, తర్వాత కొంత కాలానికి బ్రహ్మసమాజంతో ఎవరి ద్వారా తనకు పరిచయం ఏర్పడిందో, ఆ నాయుడుగారితో భేదాభిప్రాయాలు రావటంతో చలం బ్రహ్మ సమాజంతో తెగతెంపులు చేసుకోవటం కూడా జరిగింది ఈ సంఘటనలలో చలం నాస్తిక భావనకు లోనై జీవించాడు. 'ఈశ్వరా! మాపట్ల నువ్వు ఉన్నావని ధైర్యంతో సత్యం కొరకు లోకాన్ని ధిక్కరించి ఏకాకులమై నిలిచాం. నువ్వు వొదిలావా మమ్మల్ని? నువ్వు లేవు. ఉంటే ఇట్లా వొదలవు మమ్మల్ని,' అని దైవాన్ని విమర్శించాడు.

ఈ సమయంలో చలం మతాన్ని, మత గ్రంథాలను, మతానుయాయులను విమర్శించటం కూడా జరిగింది. 'ఈ ఋషులూ, బైరాగులూ, వేదాంతులంతా అప్రయోజకులని మతాన్ని ఆదరించే భక్తులను విమర్శించాడు. భక్తితో పాదుకు పోయిన వ్యాపార నాగరికతలోని లోపాలను ఎత్తి చూపాడు.

*'Half Sentiment, Half Superstitions, and Selfishness.*

హరనాధ్, సాయిబాబా, రమణ మహర్షి,
నేనిస్తాను పుచ్చుకో
నేనడిగింది ఇచ్చుకో
కాకపోతే నువ్వెందుకు
నేనడిగిందానికి,
నీకు నేనేమివ్వాలి?

భోజనాలూ, స్తోత్రాలూ చాలా? ఇంకా దానాలు, సంతర్పణలూ మొక్కుబళ్లూ కావాలా? ఖర్చుగా వుందే! నాకు కావలసింది నీవా చేస్తావో చెయ్యవో

పని జరిగితేనే *fees*
మొగుళ్లని బతికించి, జుట్లు నిలపెడితే
ఆ జుట్టుని నీకిస్తా,
సజావుగా, తెలివిగా వుంది బేరం!
దేవుడా నువ్వు వుంటే
నీ భక్తుల్ని చూసి ఎంత సిగ్గు పడుతున్నావో

అని డబ్బుతో ముడిపడి పయనించే భక్తి తత్త్వంలోని మౌఢ్యాన్ని చలం ఎత్తి చూపించాడు.

మానవుడు ఎప్పుడో కష్టాల్లో ఉన్నప్పుడు పరిష్కార మార్గం కోసం దేవుడ్ని వేడుకోవటం జరుగుతుంది. అటువంటి సమయంలో పరిష్కార మార్గాన్ని చూపమని ఏ దేవుళ్లైనా, ఏమతాన్నైనా చలం విమర్శిస్తాడు, 'లోకంలో ఈ బాధకి, మృత్యువుకీ, అర్థం తెలియజెప్పేదాకా ఏమతమూ యేమీ విజ్ఞానం ఇవ్వలేదు. వూరికే చెప్పడం కాదు. మన

Reason న్ని బౌనని వొప్పించాలి. ఆ పని చెయ్యలేది. యీ మతాలు మనుష్య జీవితానికి అనవసరంగా పట్టిన చీడలు. ఉత్త మూర్ఖత్వానికీ ద్వేషాలకీ కారణాలు' అని విమర్శిస్తాడు.

ఈ విధంగా రవి మరణంతో నాస్తికుడైన చలానికి కొంతకాలం తర్వాత దీక్షితుల చేయూతతో భగవాన్ రమణ మహర్షి దర్శనం కలగటం, అదే సమయంలో తన కుమార్తె సౌరీస్ ఈశ్వర సాక్షాత్కారం పొందటం, చలంలో ఆస్తికత మీద మరల విశ్వాసం కలిగించాయి. 1936లో దీక్షితుల ఆధ్వర్యంలో చలం భగవాన్ రమణ మహర్షి దర్శనానికి వెళ్ళటం జరిగింది. భగవాన్ పాదాల ముందు ఆత్మార్పణం చేసుకొంటూ 'నాకేమైనా రానీ, రాకపోనీ ఈశ్వరుడు మాత్రం సత్యం ... నాలో మార్పు. మార్పు. అంటారు నాలో మార్పు ఏమిటో ఏం జరిగిందో నాకు తెలియదు. నాకు మాత్రం విశ్వాసం ఈశ్వరుడు ఉన్నారు. భగవాన్ ఉన్నారు.' అని భగవాన్‌కొనియాడాడు. ఈ విధంగా దీక్షితుల ప్రభావం, తనకుమార్తె సౌరిస్ ప్రభావం, రవీంద్రుని కవిత్వప్రభావం వల్ల చలం ఆధ్యాత్మిక జీవితంలో మరల అడుగు పెట్టాడు. జీవితాన్ని ఈశ్వరాంకితం చేసుకొన్నాడు చలం.

భగవాన్ రమణమహర్షి సాహచర్యం లభించటంతో చలం భక్తి పారవశ్యంలో తేలియాడాడు. ఆ సమయంలోనే విగ్రహారాధనకు చోటు చేసికొన్న ఆధ్యాత్మిక కావ్యాలు వ్రాయడం జరిగింది. అవి విన్నపాలు, నివేదన, యశోదగీతాలు సుధా మొదలైనవి.

'నేను నువ్వు విన్నెట్లా విడుస్తాను?
హృదయంలో కట్టేసుకున్నావుగా, ఎట్లా
వెడతాను?

అంటే నమ్మాను నీదొంగమాటలు

ఎక్కడ ఉన్నావు? అని ఈ విధంగా దేవునికి విన్నవించుకొంటాడు. పరమాత్మ దర్శనానికి ఆల్లాడే మనస్సు, ఆతృత ఈ వాక్యాల్లో స్పష్టమౌతాయి.

చలం తన సుధాకావ్యాన్ని కూడా ఈశ్వరాంకితం చేశాడు. 'నాసుధా కావ్యం వేదాంతం గాదు, అది దుఃఖాలతో; వేదన ఆనందాశ్రువులతో కూడిన జీవితసారం'' అని దుఃఖితులు, దీనులు, ఉన్న ఈ లోకంలోనే గర్వాంధులు పదవీ వ్యామోహ పీడితులూ కూడా ఉన్నారని బాధపడుతూ, దీనులను గూర్చి ఇలా అంటాడు.

'దుఃఖవంతులారా, రండి
మీ ఆర్తి నార్పుతాము
దీనులారా, కుంగిపోకండి
మీరు ధన్యులు
బీదలారా, సాదులారా రోదించకండి
స్వర్గ రాజ్యం మీది
గర్వాంధులారా, పరహింసా ఉన్మత్తులారా
ఐశ్వర్య పదవీ వ్యామోహ పాషాణ
హృదయులారా
దైవమున్నాడని మరువకండి'

అని దీనులకి, పేదలకి అభయాన్నిచ్చాడు. పదవీ వ్యామోహ పీడుతులను హెచ్చరించాడు.

యశోద గీతాల్లో కూడా భగవంతుని సాన్నిధ్యాన్ని గురించి వివరించబడింది. దీనిలోని పాత్రలను చలం సంకేతాలుగా నిలిపి రాయటం జరిగింది. ఏ విధంగా నంటే యశోదాదేవి చలానికి సంకేతంగా, కృష్ణభగవానుడు రమణ మహర్షికి సంకేతంగా తీసుకోవటం జరిగింది. తల్లి, తనయులుగా

భావించి చలం ఆధ్యాత్మిక సాధనలో నిమగ్నమై మాతృత్వ స్థానాన్ని, ప్రాధాన్యాన్ని ఉన్నత శిఖరాల నధిరోహింపజేస్తూ యశోదా గీతాలను భగవాన్ రమణ మహర్షి పాదాల ముందుంచటం జరిగింది.

నివేదనలో కూడా చలం భగవాన్‌కి తన్ను తాను అర్పించుకున్నాడు.

'నాకింక వెనక తోవలేదు,  
తోవ తప్పి పోయినాను...  
నీలో తప్ప నాకు వేరే చోటులేదు  
నీ ఆలింగనంతో తప్ప నాకు శాంతిలేదు'

అని చలం అన్నిటిని వదలి భగవాన్ రమణ మహర్షిని చేరుకొంటాడు.

ఆదే విధంగా చలం తన ఆధ్యాత్మికత కొరకు కొన్ని మత గ్రంధాలను అనువాదం చేయడం జరిగింది. తన కుమార్తెయైన సౌరిస్ దైవాత్మ రూపంలో కనిపించి బైబిల్‌ను అనువాదం చెయ్యమని కోరడం. బైబిల్ లోని కొన్ని సువార్తలను 'శుభ వార్తలు' అనే పేరుతో చలం అనువాదం చేసి క్రైస్తవ మతం ఎడల కూడ తన గౌరవాన్ని చాటుకుంటాడు. దీనితో పాటు ఇంకా భగవద్గీత మొదలైన వాటిని అనువదించటం జరిగింది. భగవద్గీత అనువాదం గూర్చి ముందు మాటలో ఈ విధంగా అంటాడు చలం. ''సంస్కృతం గాని, వేదాంతంగాని, ఏమి తెలియని నాకు భగవద్గీత నిగూఢార్థాన్ని బోధించి రాయించాడు ఈశ్వరుడు'' అది ఈశ్వరుని యెడల గల తన నమ్మకాన్ని చాటుకుంటాడు.

ఈ విధంగా చలం ఆధ్యాత్మిక జీవిగా జీవించటానికి అతని వెనుక ఎంత మంది సంఘ సంస్కర్తలు, ఋషులు, సాహితీ వేత్తలు, హిందూ, ముస్లిం, క్రైస్తవ మత సిద్ధాంత గ్రంథాలే కాక, ఎన్నో శక్తులు పనిచేయటం జరిగిందని చెప్పవచ్చు. ఇన్ని శక్తులు చలం ఆధ్యాత్మికుడిగా మారటానికి పని చేసినప్పటికి తనదైన ఆధ్యాత్మిక మార్గాన్ని భావితరాలకు అందించే బృహత్ ప్రయత్నం చేయలేక పోయాడని ఘంటాపథంగా చెప్పవచ్చు.

# కవితా వీధి

## రామ బాణము

### తృతీయ సర్గము

— ఊట్ల కొండయ్య

ఈశ్వరేచ్ఛ యొకం డాశ్రయించి నామ
రూపముల నొకనాడు నరుండెఱుంగ
కుండ నొక్క పిట్టయు నెఱుంగకుండు వేళ
వెడలె సిద్ధాశ్రమము గగుర్పొడువ పుడమి,

ఆనడికి రేయి నిశ్శబ్దమందు జగతి
తిమిర కంబళి గప్పి నిద్రించు తరిని
హరిని దాల్చు గరుత్మంతు డనగ నరిగె
నీశ్వరేచ్ఛాధరు డొక మునీశ్వరుండు

మై మరచి తాను నిద్రానిమగ్నయైన
మేలుకాంచి బిడ్డడు తన మీద నాడ
నతని పదములు ముద్దాడు నమ్మవోలె
నడుగడుగునన్ మునీశు ముద్దాడె నవని.

అడుగుల శబ్ద మాసుర భయాన్వితధాత్రిని వెన్నుతట్టు న
ట్లుడుగక మ్రోసి, యేకలయ యొప్పగ నెల్లెడ మారుమ్రోగె న
య్యడవుల వాగులన్ నదుల నద్ది తటాకములందు, మౌనివ
డు చనె తారకాగణము రోచుల పూవులు కుమ్మరింపగన్.

4–1–123/1, మోతీసింగ్ స్ట్రీట్, సుల్తాన్ బజార్, హైదరాబాద్–195.

వెలుగు దివియ వడువున, శా
ద్వలమున వెల్లావు పరచు పగిది, సరసీ
జలముల హంసము వోలెన్
కల నిదురన్ వలెను మౌని నడచెన్ రేయిన్. 5

ఇట నా బ్రహ్మమయుం డరణ్యమున ని ష్ఠైకాకి యై మిణ్గురుల్
తటిదా దర్శనమిచ్చి మున్నెగుర, స్రోతస్స్వామ్యుఁడై సాగిపో
నట సిద్ధాశ్రమ వాసు తాయతిముని స్వాధ్యాయు లంతంత నా
క్కట మేల్కాంచిరి వేగునన్ గురు నమస్కారార్థులై చయ్యనన్. 6

చనియట కన్గొని శూన్యశ
యన మాశ్చర్యాబ్ధి మగ్నులై యాశ్రమమె
ల్లను వెదకి వేసరుచు, యుసు
రనుచున్ జేరిరి శివాలయ కుటీరమునన్. 7

వేగునలేచి శుద్ధుడయి వేగిర మయ్యెడ యోగనిష్ఠలో
తూగు గురుండు సుస్థిరత తో చెడు నా స్తరణమ్ము నేడు దు
ర్యోగముబట్టి రిక్తమయి యోటు వడెన్ విధి చేతనంచు నా
శాగల లోకనాయకు లకంపిత ధైర్యులు పల్కిరందరున్. 8

గురుచరణ పూజనమ్మున
తరించు సంపెగల చెవుల ధరియింపని వా
సరమాయె నేడు గంధ
మ్మిరవొందని సుమము వోలె నిది యనిరి మునుల్. 9

సంయమము జీల్చి యెగయు బాష్పములు సబ్వ
ఘోష బాహ్యజగత్తు వ్యాకుల మొనర్చు
సంయమము క్రింద పొరు బాష్పము లదృశ్య
మానములయి మహికి తోచ తేనియల్లై. 10

వారిముఖ ప్రసన్నతల వర్తిలు హాసము వెన్క పేర్మిచ
ల్లారని కూర్మలెయ్యెవి వ్యధాగ్నుల రేపె నెవండెరుంగు? గం

ధీరులు వారలంత నుపవిష్ట సమాహితులౌచు నాశ్రమా
చాత శివార్చనా విధులు సల్పిరి శంకరశిల్ప సన్నిధిన్. 11

అపుడు దైవ పాదద్వయ మంటియున్న
తాళపత్రమ్ముగని యొక్క తరుణయోగి
కన్నుదోయి జల్లెడంతగాగ నరచె
నదిగొ! గురులేఖయని యెల్ల రబ్బమంద. 12

అతడా పత్రముగాంచి దక్షిణ కరమ్మల్లల్లనన్ సాచి, సం
చిత భక్తి ప్రతిపత్తి పెల్లుబుక దానిన్ చేత గిలించి, తో
షితులై శ్రోతలు సాధువాదములు వర్షింపన్ పఠించెన్, ప్రకా
శిత తైలమ్మగు నంధ దీపకలికా స్నేహమున న్నిమ్మెయిన్. 13

నాయనలార! నా హృదయనందనులార! వసుంధరాశివ
శ్రీయుతులార! లోకహిత చింతనులార! సహవ్రతాత్ములా
రా! యతివర్యులార! శుభమయ్యెడు నేనిట లేమి దైహిక
మ్మేయగు, నా మన మ్మిచటనే కల దాశ్రమకేకి యట్టులన్. 14

నాకయి యన్వేషింపం
బోకుడు, నను వెన్న డింప బూనకు, డిదియే
మీకాన మరలు వరకున్,
లోకమయుడు తోడురా కలుగునె భయంబుల్. 15

నా పరోక్షము సాధనకు తపశ్చర్యకు
బాధకమ్మగునను భ్రాంతిలేదు
తండ్రి యంతైన పుత్రకు లట్టిడులు యథా
క్రమ నిత్యనైమిత్తికము లెడపరు
లోకశుద్ధైశ్వర్యలోలుపతను మించు
తప మేయుగమున నెత్తరిని లేదు
పరమేశ్వరుడు దయాపరుడు నా జన్మము
చరితార్థ మొనరింప సరకు గొనియె

ఇదియె మూడిన దౌర్భాగ్య మిలకు నేడు
దీని యుపశమనమస్మదీయధర్మ
మఖిల జనతాగ్రగాములమైన మనకు
సర్వధర్మమ్ములును దీని సాటి కావు. 21

ఇదియె మదాత్మలో కలుగు నీశ్వరునానతి, సానుకూలతన్
పదిలమొనర్చు దానికి ధృవమ్ముగ నాతడె యెందు నందు తో
యెద, విజయమ్ము తోడుకొని యే యిటవచ్చెద, స్వస్తి మీకనన్
చదివెయు వర్చి, శ్రోతలట శిల్పములైనటు లాలకింపగన్. 22

అరచె నాశ్రమకేకి యయ్యారుణు జూచి
పండు బుట్టె కొండకులెందు లెండనంగ
విడిచి తన్మయత్వము లేచి విలవిలమని
యచ్చోటు వాసిరి వారు కాల్యములుదీర్చ. 23

నడచిరి, యేరు దినుదినమ్ము గురుండు చనంగ మున్ను వెం
బడిచనుచున్న యట్లు ముని పాదగతిన్ కనులొప్పగించి యే
గెడునటు లొక్క భ్రాంతి యెసగెన్, పరికింప వివర్తులందు నె
య్యెడను నిజమ్ముకంటె భ్రమమే కదవాస్తవ మట్లు తోచెడిన్. 24

తోయావగాహమ మాపుడున్
పాయదు తన్మాయ వారి భావన నర్ఘ్య
మ్మియు నెడ కర్మసాక్షికి
దోసిట బ్రహ్మర్షి మూర్తితోచె జలములన్. 25

కుతప మప్పుడు భిక్ష కొరకయి పరిసర
పల్లిలందు భ్రమించు పట్ల గృహిణు
లయ్యలారా! సేమమా గురునకు నని
వందనములు చెప్పి వంపునపుడు
గురు కీ వ్యంజనము రుచి చూపుండని
యొక యమాయిక మాత యొసగి నపుడు

సత్యమాడుటను నసత్యమాడుటను మె
చ్చక మౌన మందహాసమున మరలి

చరణయుగళ మభ్యాసవశమ్ము చేత
నాశ్రమము జేర్ప శుద్ధులై యమ్మునీంద్రు
లంత బొమ్మలు కుడుచు నట్లారగించి
రందరును నాగురుసమక్షమందు వోలె. 26

వారు గురుబ్రహ్మమయులు
నారూఢ ధ్యాన యోగులై బాహ్య జగ
మ్మోరగిల కుండలీ వి
వ్యారోహణ మనుభవించి రంద రచలురై. 27

# మూడు కవితలు

అడిగోపుల వెంకటరత్నం

## సంక్లిష్టమే ఉత్కృష్టం

కవిత అర్థం కానీకు
కవిని పాఠకుడు తూకం వేస్తాడు
వస్తువు మర్మం తెలియనీకు
చెక్కిన శిల్పం నిగ్గు తేలుస్తాడు

## అప్రమత్తం సుమా

నత్తా నడుస్తూ వుండు
కాస్త విశ్రాంతి తీసుకుని
నిన్ను కలుస్తాను.

## ఊరకదంపుడు

గంట సేపు ఉపన్యాసం సాగింది
ఒకసారే పని చేసిన మైకు
ఒక్క మాటనే ప్రసారం చేసింది
అదొక్కటే మంచి మాటేమో.

నాగార్జున యూనివర్సిటీ, గుంటూరు–522510.

# కథావీధి

తెలుగు కథ

## సొల్యూషన్

డా॥ జి. ఉషా లావణ్య

క్లాసు ముగించుకొని, హడావుడిగా బుజానికి బేగ్ తగిలించుకుంటూ బయలుదేరింది వింధ్య. బయట ఆమె భర్త స్కూటరు స్టార్ట్‌చేసి ఆమెకోసం చూస్తున్నాడు.

కారిడార్ లో ఎదురుపడింది షీల.

'గుర్తుందా? రేపు పార్టీకైనా రావాలి కనీసం', అంది ఆమెను నిలేసి.

'ఓ! అవునుకదా' కాని షీలా ఇంటి నిండా బంధువులు. వాళ్ళని వాళ్ళ మానాన వదిలేసిరావటం .... మా అత్తగారు కోపగించుకుంటారేమో''

''ఎంత అరగంట. పూజకాగానే వచ్చేద్దురు.'' మొహం కాస్త చిన్నబుచ్చుకుంటూ అంది.

''అదికాదు షీలా మాయిల్లు ఎంతదూరమో తెలుసుకదా, ఎంతలేదన్నా గంటపైనే పడుతుంది. మీయింట్లో గంట....అరగంట ...మేం ఇల్లు పట్టించుకోకుండా తిరుగుతున్నాం అనుకోరా?'' నచ్చచెబుతున్నట్టు అంది వింధ్య.

ఉద్యోగాలు చేస్తూ వచ్చిన బంధువులకి కావల్సినవి ఏలోపం రాకుండా చూడటం ఎంత కష్టమో అనుభవించిన వాళ్ళకి తెలుస్తుంది—అదే సమయానికి యింట్లో మనిషి లేనప్పుడు, వున్నవాళ్ళు అనారోగ్యంతో బాధపడేవారు అయినప్పుడు.

''ట్రై చేస్తాను.'' అంది చివరకు వింధ్య. షీలను మరీ చిన్నబుచ్చడం యిష్టంలేక.

ఊరికి దూరంగానే అయినా మంచి డెవలపింగ్ ఏరియాలో యిల్లుకట్టుకున్నారు— ఇల్లు బ్యూటీ పార్లరు ఒకేచోట వుండేలా. ఉదయం గృహ ప్రవేశం అయ్యాక ముఖ్యమైన వాళ్ళకు మాత్రం భోజనాలు ఏర్పాటుచేసి, సాయంకాలం పార్లర్ ఇనాగరేషను —పార్టీ పెట్టుకున్నారు. ఆ పార్టీ విషయం తన కొలీగ్స్‌కి మరోసారి గుర్తుచేయటం కోసమే వచ్చింది షీల. అయితే స్కూలు వుండటం వల్ల ఉదయంపూట వెళ్ళటం కుదరదు అనుకున్నారు.

పి.జి. కాంప్లెక్స్, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఖైరతాబాదు, హైదరాబాదు—500 004.

అందరూ. సాయంకాలం పార్టీకి వెళ్ళాలని నిశ్చయించుకున్నా స్టాఫ్‌మీటింగ్‌లో బాగా ఆలస్య అవటం వల్ల తిన్నగా యింటికి వచ్చేసింది వింధ్య, ఆ మరునాడు, ఇల్లు చేరుకునే సరికి ఆమెఆడపడుచు ప్రతిమ అందరికీ కాఫీలు చేసి యిస్తోంది. అన్న గారింట్లో ఆడపడుచులా పెత్తనాలు చెలాయించా లనుకోదు ప్రతిమ. అటు వంటపనిలో సహాయ పడుతూనే యిటు పిల్లలకి ఏదో ఒకే వ్యాపకం కల్పించి అదుపు చేయటంలో మంచి నేర్పరి. పిల్లలు కూడా నెమ్మదస్తులే. అనవసరంగా పేచీలు పెట్టు కోవటము ప్రతి దానికి చిందులు వేయటము,సతాయించి సతాయించి తమ పనులు సాధించు కోటము లాంటిది చెయ్యరు. ఒకవేళ వాళ్ళకి ఓపికగా నచ్చ చెప్పి ఒప్పించే ప్రతిమతీరు నిజంగా వింధ్యకు ఆశ్చర్యం కలిగిస్తూనే వుంటుంది.

ఆమె కయితే స్కూలు నుంచి వచ్చీరాగానే పిల్లల డ్రస్సులు మార్పించి, కావల్సినది చూసి. వంట అదీ అయ్యాక హోమ్‌వర్కు చేయించి ఆతర్వాత బండెడు పుస్తకాలు కరెక్షనుకి ముందేసుకునికూర్చొ వాల్సి రావటము, టీచింగ్ నోట్సు తయారు చేయటం యిలా హైరాన పడుతుంటే పిల్లలు ఒక్క మాట అతిగా మాట్లాడినా రెండు తగిలించాలనిపిస్తూ వుంటుంది. ఉదయం నుంచి అరిచి అరిచి పాఠాలు చెప్పొచ్చి యింట్లో యిలా వాదులాడుకునే పిల్లలకి నచ్చ చెప్పే ఓపిక ఆమెకు వుండదు.

పిల్లల్ని పెంచటం నిజంగా బాధ్యతతో కూడిన పనే. ఆ బాధ్యతను సక్రమంగా నెరవేర్చ గలం అనుకున్నవాళ్ళే పెళ్ళి పెటాకులు చేసుకోడం వుత్తమం. అలా అనుకుంటాంగాని సమస్య అదొ క్కటే కాదు కదా? తన కొలీగ్ సీత విషయమే తీసుకోవచ్చు. జరగాల్సిన వయసులో పెళ్ళి జరగ లేదు. ఇప్పుడిక జరుగుతుందన్న నమ్మకమూ లేదు. దానితో స్కూల్లో మిగత అధ్యాపకులను ఆక ర్షించాలని నిరంతరం ఆమె పడే తాపత్రయము, అందరూ ఆమె గురించి అనుకునే మాటలు— చాల అసహ్యకరమైన పరిస్థితి అయినా అన్నీ భరిస్తుంది. —అది అన్నీ జీవితంలో ఒక భాగమే అన్న కొత్త ఫిలాసఫీ కావచ్చు?

ప్రతి మనిషి జీవితం లోనూ ఏవో లోటు పాట్లు వుంటూనే వుంటాయి.సర్దుకు పోవటంలోనే ఆనందం వుంటుంది

''వదినా, నీకు ఫోను'' ప్రతిమ కేకతో ఆలో చనలనుంచి బయటపడి చేస్తున్న పనిని వదిలి వెళ్ళింది వింధ్య.

ఏమిటి, రావటం లేదా? ''షీల స్వరం కాస్త సీరియస్‌గ వినిపించింది. దాన్ని తేలికగా తీసు కుంది వింధ్య

చిన్నగా నవ్వి నచ్చచెబుతున్న ధోరణిలో ''చెప్పాను కదా షీలా, రేపు మా వాళ్ళంతా వెళ్ళి పోతారు. ఆ తర్వాత వస్తాం. ఈ రోజే రాకపో తేనేం,'' అంది.

''ఈరోజుకి రేపటికి తేడా లేదా?'' సాగ దీసింది.

'అలా అని కాదు...'

'మీ వారున్నారా? నేనడుగుతాను...'

ఈసారి గట్టిగానే నవ్వింది వింధ్య,

క్లయింట్స్‌తో మాట్లాడుతున్న మహేంద్రకి కబురు పెట్టి కిచెన్‌లోకి వెళ్ళింది. కొంచెం సేప యాక ఆమె వెనకే వచ్చాడు మహేంద్ర.

'ఏమిటి? మీ ఫ్రెండు అంతగా అడుగుతోంది? ఎలా? తనకూ కేస్ డిస్కషన్ వుందన్న అర్థం స్ఫురించేలా అన్నాడు.

'నేను చెప్పాను....షీలవుతోంది'

'నీ వంట ఎంత వరకు వచ్చింది?'

'అయిపోయినట్టే.'

'ఆవిడ ప్రతిమను కూడా తీసుకురమ్మని గట్టిగా చెప్తోంది. అందరం అలా కాసేపు తిరిగి వచ్చినట్లు వుంటుంది. వెళ్దామా పోనీ?' మొహ మాటంగా అన్నాడు.

ఏడు దాటి పోతోంది. వంటలు కనీసం పిల్లలు తినటం అయినా పూర్తయితే పెద్దవాళ్ళు ఎలాగో సర్దుకుంటారు. కాని తయారయే సరికే ఎంత లేదన్నా ఎనిమిది దాటుతుంది. ఇక వెళ్ళేదెప్పుడు? వచ్చేదెప్పుడు? పిల్లలకి ప్రతిమకు బట్టలు పెట్టా లనుకున్నారు. ఆ షాపింగ్‌పని అలాగే వుంది. ప్రయాణానికి పిల్లలకని జంతికలు సున్నుండలు చేసే పని కూడా పెట్టుకుంది. ఎప్పటికి అవుతాయి ఈ పనన్నీ!!

'నేనుంటాలే వదనా, వాళ్ళతో పెద్ద పరిచయం కూడా లేదు నాకు. మీరు వెళ్ళిరండి' ప్రతిమ అంది

'వద్దులే అందరం వెళ్ళి త్వరగా వచ్చేద్దాం. మీరు తయారుకండి' అన్నది తన క్లయింట్స్‌ని పంపించేసేందుకు వెళ్ళిపోయాడు మహేంద్ర.

వింటున్న పిల్లలంతా గోల మొదలుపెట్టారు మేమూ వస్తాం' అని.

వాళ్ళందర్నీ తయారుచేసి బయల్దేరాలంటే మరో అరగంట ! తన పిల్లలకైతే గట్టిగా చెప్పి వారించగలదు. ప్రశాంత్ ప్రదీప్‌ల వుత్సాహం చూస్తుంటే వద్దనటం మంచిపని కాదనిపించింది వింధ్యకు.

అందరూ బయల్దేరి వెళ్ళేసరికి ఎనిమిది అయిపోయింది.

షామియానా దాదాపు ఖాళీగా వుంది. అందరూ వచ్చి వెళ్ళి పోయినట్టున్నారు. ఉన్నవాళ్ళల్లో ఎక్కడైనా తన కొలీగ్స్ కనపడతారేమోనని చూసింది. వింధ్య, సైన్సు, ఆర్ట్స్ అంతా కలిసి యాభయి మందుంటారు. వాళ్ళలో ఆడవాళ్ళు ఆరు మంది. వాళ్ళయినా కనిపిస్తారనుకుంది.

షీలని వెతుకుతూ లోపలికి వెళ్ళారు వింధ్య, ప్రతిమ. మహేంద్ర షామియానాలో వేసివున్న కుర్చీల్లో కూర్చున్నాడు.

లోపల హాల్లో రెండు మూడు కుటుంబాల వాన్నారు. షీల అక్కడే వుంది. వింధ్య ప్రతిమను ఆమెకు పరిచయంచేసి సంజాయిషీగా 'బాగ లేట్ అయ్యాం కదా,...." అంటూ యింకా ఏదో అనబోతున్న మాటను కట్ చేస్తూ 'పరవాలేదు. కూర్చోండి' అంది కుర్చీలు చూపిస్తు షీల. ఆమె స్వరంలో కటుత్వం కొట్టొచ్చినట్లు కనిపించింది.

ప్రతిమను పరిచయం చేసినప్పుడూ పలకరింపుగా నవ్వెందేగాని మరో మాటేం అనలేదు. షీల ప్రవర్తన వింతగా అనిపించింది వింధ్యకు అయినా యింటి పనులలోను, పూజ ఏర్పాట్లలోను అలసి పోయి వుంటుందని తనకు తనే నచ్చ చెప్పుకుంది.

'ఇల్లు చూస్తారా?' తెచ్చిపెట్టుకున్న మర్యాదతో అడిగింది షీల. ఆడపడుచును వెంటపెట్టుకుని వెళ్ళింది వింధ్య. పెద్ద ఇల్లే. బ్యూటీషియన్లు అప్పుడే బిజీ అయిపోయినట్టున్నారు. పార్లర్‌తో పాటు కాష్ కౌంటర్ దగ్గరున్న షీలచెల్లెల్ని పలకరించి హాల్లోకి వచ్చారు.

ఎందుకో షీల చాలా మూడీగా వుందని పించింది వింధ్యకు. వెంటతిరిగి యిల్లు చూపిస్తోందే గాని ఆత్మీయంగా ఒక్కమాట కూడా అనలేదు. ఏదో జరిగి వుంటుందిలే అని మరోసారి సరిపెట్టు

తుంది, వి ధ్య. ప్రతి యింట్లోనూ ఏవో పొర పొచ్చాలు వుంటాయి. ఇటువంటి సందర్భాల్లో అయితే మరీను అను నున్నది.

'మనవాళ్ళెవరూ కనిపించలేదే? వచ్చి వెళ్ళి పోయారా?'

పార్టీ అర్రింటికే! యింత సేపుం టారా! అని మనసులోనే అనుకున్నా అమె మూడ్ మార్చే ధోరణిలో అంది వింధ్య. అది అగ్నికి ఆజ్యం పోసినట్టయింది.

'అసలు నేనెవర్ని పిలిచాననీ?! మన గ్రూపునే....!' అని, 'రండి రిఫ్రెషర్స్ తీసుకుందురు' అంది తెచ్చి పెట్టుకున్న నవ్వుతో.

అంటే? ఎవరూ రాలేదనా?' కాస్త కాస్త అర్థం అవుతున్నట్లుంది వింధ్యకు. చుట్టూ చూసింది. వాళ్ళతోపాటు ఆ రెండు మూడు కుటుంబాల వాళ్ళు మాత్రమే వున్నారు. అయితే వారిలో ఎక్కడా తన భర్త మహేంద్ర కనపడలేదు వింధ్యకు.

ఒక పేపర్ ప్లేటులో హాటు స్వీటు తెచ్చి వింధ్య చేతికిచ్చింది షీల. మొహమాటంగా దాన్ని తనే ప్రతిమకి యిచ్చింది వింధ్య.

తర్వాత ట్రేలో అందరికీ తెచ్చి యిచ్చినా అందులోనూ ఒక్కటి తక్కువగానే వుంది. రవికి మిగల్లేదు. కాని అదేం గమనించనట్టు మర్లా తెచ్చి యిచ్చే ప్రయత్నం కూడా చెయ్యలేదు. వేరే వాళ్ళని పలకరిస్తూ కూర్చుంది.

పసివాడు! వాడి ముందు మిగత అందరూ తింటున్నారు.

వింధ్య తన ప్లేటులోంచి స్వీటు తీసి యిచ్చే లోగానే కాస్తమొహమాట పడుతూనే తీసుకున్నాడు.

అది అప్పుడే గమనించినట్టు అరె! చూడలేదు తింటావా' అంటుంది షీల.

గుండెల్ని పిండినట్లయింది వింధ్యకు.

పెద్ద పెద్ద పార్టీల్లోను, ఆఫీసుస్థంలాంటిది ఏర్పాటు చేసినప్పుడో అలా జరగటం సహజం. కాని అక్కడ ఎక్కువ మంది అతిథులు కూడా లేరు.

'వద్దులే....ఇంట్లో మామూలుగా తినడు ... అంది.

కారణం ఏమై వుంటుందా అని మనసులో తీవ్రంగా ఆలోచిస్తోంది. తమ కొలీగ్స్ కాని, మిగత ఫ్రెండ్స్‌గాని రాలేదా అసలు? ఎవరూ రాలేదన్న కోపమా యిది? ఎవరూ రాకపోతే మాత్రం... ఇలాగా...?

'అసలు ఈయనేడి'! మహేంద్రకోసం చుట్టూ వెతికి తను, తన క్లయింట్స్‌తోనేగాని ఆమె స్నేహితులతో అంత చనువు లేదతడికి, ముఖ పరిచయం మాత్రమే వుంది. ఒక్కడే ఎక్కడున్నట్లు?

ప్రతిమకి విషయం అర్థమైనట్లుంది.

మీ మిగత కొలీగ్స్ ఏరి వదినా?' చిన్నగ అడిగింది.

'అదే నేనూ చూస్తున్నా' మనం లేట్ అయ్యాంకద! వెళ్ళి పోయుంటారు.'

ప్రతిమ ఇంకేం మాట్లాడ లేదు. ఎవరికో వీడ్కోలు చెబుతున్న షీల దగ్గరకి వెళ్ళింది,' మాకిక శలవిస్తారా? రేపు నేను వెళ్ళిపోతున్నాను. వస్తున్నాయి' అంటూ బేగ్‌లోంచి తనకోసం కొనుక్కున్న లక్ష్మి విగ్రహం వెండిది తీసిచ్చింది.

ప్రతిమ అన్నగారి దగ్గరికి వెళ్ళి నిల్చుంది. తిరిగివచ్చిన షీల లేచి నిల్చున్న వింధ్యను చూస్తూ "వచ్చినట్టే లేదు. అప్పుడే వెళ్తాం అని బయల్దేరు తున్నారు. అంది మొక్కుబడిగా.

'చెప్పాను కద, రేపు ప్రతిమ వెళ్ళిపోతుంది. తనకు కావల్సిన ఏర్పాట్లు చూడాలి కదా' అంది వింధ్య

షీలకని తెచ్చిన బహుమతి తీసి యిచ్చింది.

పిల్లలూ మహేంద్రా కారు రివర్సు చేసి ఆమె కోసం చూస్తున్నారు.

ఇల్లు చేరే వరకు ఆలోచిస్తూనే వుంది వింధ్య. తనకే కాదు, కనీసం పిల్లలకైనా డ్రింక్స్ ఆఫర్ చెయ్యలేదు.

ఆయిపోయాయా అంటే అదీ కాదు. మర్చి పోవటమూ కాదు.

హడావుడిలో గ్రహించక పోవటం అంత కంటే కాదు.

అసలే ఆడవాళ్ళు ఎప్పుడెలా ప్రవర్తిస్తారో— ఏక్షణంలో మూడ్ ఎలా మారుతుందో చెప్పటం కష్టం ? మనసులో ఏంవున్నా ఎప్పుడూ నవ్వుతూ వుండగలిగేవారు అరుదు;

ఎంత వుత్సాహంగా బయల్దేరిందో అంతకు రెండింతలుగా పాతాళంలోకి జారి పోయినట్టుగా వుంది వింధ్యకు.

పడుకోబోయేముందు, అంత వరకు ఆమెనే మౌనంగా వుండి గమనిస్తున్న మహేంద్ర ఒకే ఒక్క మాటతో తేల్చేశాడు—"కొందరి స్వభా వమే అంత ? దానికి యింత బాధపడటం ఎందుకు ' అని.

'అంటే ? అంటే' ?

వింధ్యకు తల దిమ్మెత్తినట్లయింది.

అతడసలు తామున్న చోటికే రాలేదు, ఆ గంటసేపు ఎక్కడ గడిపాడో ఎలా గడిపాడో తనసలు గమనించనేలేదు. ఇప్పుడు ఈ మాటతో పూర్తిగా అర్థమైనట్లుయింది వింధ్యకు.

అతన్ని ఎవరూ అసలు పలకరించనే లేదన్నమాట?

రెండ్రోజుల తర్వాత.

స్టాఫ్‌రూంలో ఆమె, షీల మరో హిస్టరీ టీచరు మాత్రమే వున్నారు. ఆఫీస్‌బోయ్‌ని పంపి రెండు కప్పులు టీ తెమ్మంది వింధ్య.

ఒకటి హిస్టరీ మాస్టారుకి యిచ్చి రెండొది, తను సిప్ చేస్తూ నోటు పుస్తకాలు దిద్దుకోటం మొదలు పెట్టింది.

షీల పని వున్నట్టు అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయింది.

హిస్టరీ మాస్టారు మాత్రం కొంచెం సీరి యస్‌గ 'ఇదేంపని?' అని చిన్నగా కోప్పడ్డాడు.

పెద్దాయన కోపగించుకుని నచ్చచెప్పటంలో అర్థం వుంది.

కాని కుత కుతలాడే మనసునే తెలుస్తుంది ఆ పని ఎందుకు చేయాల్సి వచ్చిందో ప్రతిచిన్న విషయానికి విపరీతంగ స్పందిస్తూ, పరిణతి చెందని మనసుతో తమ అసూయా ఆవేశాలను, అసంతృ ప్తిని ఎదుటివారిపై ప్రదర్శించి తమ మనసుని శాంతింప చేసుకోవాలని చూసేవారు, తమ సమస్య లకు సరైన పరిష్కారం సాధించలేకనో, తమ అశక్తతను కప్పిపుచ్చుకోవాలనో ఎదుటి మనిషిని ఈలెల్లాంటి మాటలతోను చేతలతోను నొప్పించి పైశాచిక ఆనందం పొందేవారు మన చుట్టువున్న ప్పుడు మన మనసులు, మన జీవితాలు కూడా మనకు తెలియకుండానే కలుషితం కావటం సహజం అనుకుంది వింధ్య.

# మందార మాల

## భావ కవిత్వము- దాని శాఖలు

రమణీయమైన శైలి సౌందర్యాలతో పాటు తాత్విక దర్శనాన్ని కూడ కలిగియున్న కవిత్వం ఉన్నతస్థాయిని పొందే అవకాశం ఉంది. సమర్థవంతుడయిన కవి తన తాత్విక దృక్పథాన్ని కళాత్మకంగా తీర్చిదిద్దుతూ ప్రచారాన్ని కలగజేస్తాడు.

1910 నుండి మూడు శతాబ్దములపాటు ఆంధ్రసాహిత్య కేదారమున పసిడి పంటలను పండించినది భావ కవితాశాఖ రాయప్రోలు,విశ్వనాథ కృష్ణశాస్త్రి వేదుల నండూరి, నాయని, తుమ్మల అబ్బూరి తల్లా వజ్ఝల మొదలగు ప్రముఖ భావ కవుల ప్రతిభావ్యుత్పత్తులను సమపాళ్ళలో జీర్ణించుకొనినది. కవిత చెప్పిన వారిలో భావకవులదె అగ్రతాంబూలము. 'భావగీతము' అన్నప్పటికి దీనిలోని భావప్రాధాన్యతను గుర్తించి గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు మొదట దీనికి భావ కవిత్వమని పేరు పెట్టిరి. క్రమముగా అదియె స్థిరపడినది.

భావ కవిత్వమును ఈ క్రింది విధముగా నిర్వచించ వచ్చును.

'కాల ధర్మాను గతమై జగత్ప్రవృత్తి మారునపుడు వాఙ్మయము మారు నిజము'

ఇదియె కాకుండా కవి సార్వభౌమ విశ్వనాథ వారి నిర్వచనం ప్రకారము కవి యొక్క ఒక అవిస్పష్ట వాంఛాంకురము అంతర్నిగూఢ తాపము ఒక చిన్న కావ్యములో ఇమిడిన అది భావ కవిత్వము తరువాత శ్రీ శ్రీ భావకవిత్వ వివరణ చెపుతు 'హృదయానను పూర్ణితము చేసే ప్రమాద ప్రాంతరమున కూడ కవికి నిరాఘాటంగా సంచరించే అధికారం కలదు. అపుడే కవి మనస్సులో నుండి ఒక గీతం విలక్షణ ధోరణిలో వెలువడుతుంది. అది కవి యొక్క అనుభూతిని స్పష్టముగా పాఠకునిలో ఆవిష్కరింప చేయ గలుగుతుంది. ఇదియె ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనము అని వివరిస్తారు. అల్పకాలంలో అనల్పరససిద్ధిని చేకూర్చే ప్రయత్నం భావ కవులు చేస్తారని పంచాగ్నుల ఆది నారాయణ శాస్త్రి గారన్నారు.

కవిత్వానికి కావలసిన వస్తుభావ రచనలతో భావము ప్రధాన మయినది. కవిత్వ మంటె కావ్య మని కూడా అర్థం. కావ్యాలు వస్త్వాశ్రయాలు. కవిత్వంలో వస్తువు లేకున్నా భావానికి ప్రాధాన్యత ఇవ్వడం. అవసరం 'వాక్యం రసాత్మకం కావ్యం' కావుననే అమరకుడి శ్లోకాలు భాగవతములోని గోపి

కృష్ణుం గీతాలు రససిద్ధిని కలుగ జేస్తున్నాయి. కృష్ణశాస్త్రిగారు చెప్పినటువంటి.

'ఏను మరణించు చున్నాను ఇటు నశించు
నా కొరకు చెమ్మగిల నయనమ్ము లేదు
పసిడి వేకువ పెండ్లిండ్ల బసిన యెవరు
నేర్తురు జరరాంధకార మృతికి'

అనునది కరుణ రసప్లావితముగా ఉంది. నారాయణ రెడ్డిగారు 'భావకవిత్వం రసహీన మైనదికాదు, భావ ప్రధానమైనది. భావ కవిత్వం అది ఉత్తమశ్రేణిదైనప్పుడు తప్పక రస శిఖరముల నందుకొంటుందని నా అభిప్రాయం' అని తమ నిర్వచనం తెలియచెప్పారు.

## భావ కవిత్వము యొక్క స్వరూపము—లక్షణములు

1. భావకవిత్వము అంతర్ముఖీయమైనది.

2. దానిలో ధ్వని స్పష్టత వుంటుంది. అందుకనే కృష్ణశాస్త్రిగారు ఏవియు అర్థమ్ము కాని భావగీతములవి అంటారు.

3. భావకవిత్వము స్త్రీ పురుషుల యొక్క బాహ్య సౌందర్యాలకు కాక ఆత్మ సౌందర్యానికి ప్రాముఖ్యతను ఇస్తుంది. అంతియే కాక భావకవిత్వము ప్రకృతిని సజీవంగా చిత్రిస్తుంది.

భావ కవిత్వంపై పాశ్చాత్య సాహిత్యంలోని Ramantic poetry ప్రభావం కన్పిస్తుంది. అయినా మన భావకవులు భారతీయ సంప్రదాయాన్ని ప్రతిబింబింపజేస్తూ తెలుగుదనాన్ని గూడా నిలిపారు. కవి ఆలోచనలను మథించి వర్షించిన ఒక రసమయ గోళము భావము. దీనికి ఎట్టి అడ్డంకులు వుండవు. కృష్ణశాస్త్రి గారి ఉదాహరణ—

ఆకులో ఆకునై పూవులోపూవునై
కొమ్మలో కొమ్మనై నునులేతరెమ్మనై
ఈ అడవి దాగిపోనా ఎటులైన ఇచటనే
ఆగిపోనా

పగడాల చిగురాకు తెరచాటు తేటనై
పరువంపు చిగురాకు విరిచేటి చిన్నారిసిగ్గునై
ఈ అడవి దాగిపోనా.

భావకవిత్వమందు 1, కావ్యపరిమాణం 2. వస్తువు 3, శైలి 4, ఆత్మాశ్రయరీతి, దీని యందు కవియొక్క అనుభూతె కావ్యవస్తువు. *we insensibly Imitate we habitually admire.* అని కాలరిడ్జ్, అన్నారు భావకవిత్వంలో వస్తువైవిధ్యానికి ఆంగ్ల సాహిత్యంపై గల అభిమానం కొంత దోహదం చేసింది. భావకవులకు భావ వ్యక్తీకరణ ప్రధానం వాడుక భాషలో చిన్న చిన్న పదాలు జానుతెనుగు పదాలు వ్యావహారిక పదాలు సామెతలు భావకవిత్వము యొక్క ఆదరణ పొందాయి. భావకవులు రచనా శైలిలో నవ్యత్వము ను సాధించారు. భావకవిత్వం పూర్తిగా నూతన కవిత్వమని అనుకోవటానికి వీలులేదు. ప్రాచీన గ్రంథమైన భారతంలో సంజయ రాయబార ఘట్టం, కాళిదాసు మేఘసందేశం, పోతన గోపికా గీతాలు. కృష్ణ కర్ణామృతం. సౌందర్యలహరి, ఋతుసంహారం సూర్య శతకము, మూకపంచాశతి, ధూర్జటి కాళహస్తీశ్వర శతకం పాదుకా స్తవం కొమాండూరి కృష్ణమాచార్య భక్త చింతామణి వీటన్నింటి యందును భావకవిత్వము యొక్క లక్షణాలున్నవి.

ప్రణయ కవిత్వము (Love Poetry) కుదాహరణ కృష్ణ శాస్త్రిగారి పక్షము.

సారథము చిమ్మ పువ్వు ప్రదజంబు?
చంద్రికల నేల వెదజల్లు చందమామ

ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను

దీనిలో ఆత్మాశ్రయ రీతి *SubJectiue Peotry*) వస్త్వాశ్రయ రీతి (*ObJectiue Peotry*) వుంటాయి.

చిలకమర్తి, రాయప్రోలు. కాటూరి మొదలగు వారు దేశభక్తిని ప్రబోదిస్తూ ఎన్నియో కవితలు వ్రాశారు.

ఏ దేశ మేగినా ఎందుకాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురైన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండుగౌరవము.

మరియు భారత ఖండంబు చక్కని పాడియావు అని చిలకమర్తి వారన్నారు.

ప్రకృతి కవిత్వము (*Nature Poetry*)
కృష్ణశాస్త్రిగారి మనంముందు చెప్పుకున్న
ఆకులో ఆకునై పూవులో పువ్వునై అనునది.
సంఘ సంస్కరణ కవిత్వము.

1914లో రాయప్రోలు వారి స్నేహలత మరియు గురజాడ వారి పూర్ణమ్మ కావ్యాలు సంఘ సంస్కరణను ప్రబోధించాయి.

ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
పిల్లలగన్న తల్లుల్లారా
విన్నారమ్మ మీ దీ కథను....అని
కాసుకులోనై తల్లీదండ్రి
నెనరు న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను
ఒక ముదుసలి మొగడికి ముడివేసిరి.

భక్తి కవిత్వము
వేంకట పార్వతీశ్వర కవులు

ప్రకృతి యదియేమో రాగసంపన్న మయ్యె
భక్తి మదియేమో యానంద భరితమయ్యె
చిత్తమదియేమో ప్రేమ సంసక్తమయ్యె.

స్మృతి కావ్యము విశ్వనాథవారి వరలక్ష్మి త్రిశతి దువ్వూరి వారి భగ్న హృదయము, బాలాంత్రపు వారి విరహ సంగీతము ఇంకను నాయని వారి మాతృగీతాలు మొదలయినవి.

ఓ సఖీ! ప్రియా భార్యా వియోగ మెరుంగ
నట్టి యో పూర్వ సత్కృతీ యకట నీవు
కర్మ శతకంబు చదువకు; యని తెలిపారు.

ఈ విధముగా భావ కవిత ఇంకా ఎన్నియో మానవతా భావాలలో అనంత వైవిధ్యంలో సాగి ఆంధ్ర సారస్వత రంగమున అప్రతి హతమైన ప్రవాహమును కలిగి యున్నది.

టి. వసంత
ఇం.నెం. 9-1-169, గిర్మాజిపేట,
వరంగల్-506 002

# నవల-సమకాలీన సమస్యలు

నవలా కారుడు సగటు మనిషిలాంటి సాధారణ సంఘజీవి కాదు. సగటు మనిషి కారణాంతరాల వల్ల తన చుట్టూవున్న సంఘాన్ని వస్తున్న మార్పులను అంతగా పట్టించుకోడు. కళ్ళు, చెవి, కలం కారణంగా నవలా కారుడు నిర్లిప్తంగా తామరాకుపై నీటి బొట్టులా వుండలేడు. సంఘంలో వస్తున్న మార్పులను యెప్పటి కప్పుడు తన నవలలలో నమోదు చేస్తుంటాడు. సంఘ లోని అలజడులు, సంఘటనలు. మార్పులు భూకంపాలైతే నవలా కారుడు ఈ భూకంపాల తీవ్రతను నమోదు

చేసే యంత్రంలాంటివాడు. అందుకే మొపాసా నవలా రచయిత ధ్యేయం. కథ చెప్పటం, పాత్రల్ని పరవశుల్ని చేయటం మాత్రం కాదంటారు. ఇదే అతని ధ్యేయమయితే అతనికీ చరిత్రకారుడికి అట్టే వ్యత్యాసం, వుండదు. ప్రతి సంఘటన వెనుక దాగివున్న సత్యాన్ని వెలుగులోకి తెచ్చేందుకు ప్రయత్నించాలి. ఈ సత్యం వాతావరణ చిత్రణ ద్వారా సాధ్యమవుతుంది. ఈ వాతావరణం నవలారచయితకు సంఘం ద్వారా లభ్యమవుతుంది. అందుకే సంఘంపై అతను ఎక్కువగా ఆధారపడి వుంటాడు. ఊహాలోకంలో కవిలా విహరించలేడు. కల్పన కొంత మేరకే నవలను ముందుకు తీసుకెళ్ళగలదు. బలమైన సమస్యే నవలకు వూపిరి. అదే ప్రాణ వాయువు కూడా.

సమకాలీన సమస్యలను నవలాకారుడు ఆరంభ కాలం నుండీ చిత్రిస్తూనే వస్తున్నాడు. కుల వర్ణ వ్యవస్థలు, జమీందారుల ఆగడాలు సమాజ శరీరం పైని రాచకురుపులు మొదలైన వాటికి నరహరి గోపాలకృష్ణయ్య శెట్టిగారు, కందుకూరి వీరేశలింగం గారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, ఇత్యాదులు భావించి తమతమ నవలద్వారా తీవ్రంగా శస్త్ర చికిత్స చేసేందుకు ప్రయత్నించారు స్వాతంత్రోద్యమ కాలంలో వెలువడిన మాతృ మందిరం 'ఓబయ్య' 'మాలపల్లి' ఇత్యాదులు ఆనాటి సాంఘిక సమస్యలకు అద్దం పట్టాయన్న విషయం మనందరికి తెలిసిందే. 'మాలపల్లి' నవలలో రాము పాల్గొన్న పుల్లరి సత్యాగ్రహం, అల్లూరి సీతారామరాజు మన్యం తిరుగుబాటు లాంటి సమకాలీన సంఘటనలను కూడా కథలో

సాంఘిక సమస్యలను చిత్రించేందుకు రాజకీయ నవల ఉపయోగ పడినట్లు మరే నవల ఉపయోగ పడదని భావించి నవలాకారుల్లో దాశరథి రంగాచార్యులు, (చిల్లర దేవుళ్ళు) బొల్లిముంత శివరామకృష్ణ (మృత్యుంజయులు) పి. లక్ష్మీకాంతమోహన్ (సింహగర్జన) వట్టికోట ఆళ్వారుస్వామి (ప్రజలమనిషి) గొల్లపూడి నారాయణ (తెలుగు గడ్డ) కుమారి వాసిరెడ్డి సీతాదేవి (సమత), రాచకొండ విశ్వనాథశాస్త్రి (గోవులొస్తున్నాయి) భూషణం (కొండ గాలి) చెరబండరాజు (మా పల్లె) శ్రీకాంత్ (దేవుళ్ళారా మీపేరేమిటి) జాతశ్రీ (బలి పశువు) అర్నాద్ (చీకటోళ్ళు) ఇత్యాదులు ముఖ్యులు. వీరి లక్ష్యం నవలను నిజ జీవితపు సారాంశంగా తీర్చిదిద్దడమే.

గత పాతిక సంవత్సరాల కాలంలో నవల కొత్తమలుపును తీసుకుంది. సంఘంలోని ఒకవర్గాన్ని ఎన్నుకుని వారి సమస్యల చిత్రణ ద్వారా మొత్తం సమాజాన్ని చిత్రించడం జరిగింది. దగ్గర దగ్గర 7వదశకం వరకు వచ్చిన నవలాకారులు. ఆతర్వాత నవలల నవలా ఉప్పెనకారణంగా ప్రేమవ్యవహారం చిత్రించే ప్రయత్నం జరిగింది. కులం, జాతి, మతం లాంటి పాత సమస్యే అయినా రంగనాయకమ్మగారు తమ బలిపీఠం ద్వారా సమస్యకు కొంత ప్రేమను కూడా జోడించి జన రంజకమైన నవల రాయగా, ఆ దారిలోనే ఎందరో రచయిత్రులు రచయితలు నడవసాగారు. తత్ఫలితంగా మనకు మాలపల్లి, బలిపీఠం, లాంటి ప్రయోజనాత్మక నవలలకు ఎన్నో కార్బన్ కాపీలు లభించాయి.

ఈ రోజు వారపత్రికల పుణ్యమా అంటూ నవల ఒక విధంగా పాత్రికేయుల రిపోర్టుగా మారింది. పేజీలు నింపాలన్న ఉద్దేశ్యంతో చిన్న పెద్ద సమస్యలను ఎన్నుకోవడం ఉపన్యాస ధోర

జీలో ఆ విషయాన్ని చర్చించడం జరుగుతున్నది. ప్రమదావనం జవాబుల ధోరణిలో కావల్సిన విషయాన్ని చర్చించడం మానుకొని పాండిత్య ప్రదర్శను ప్రదర్శించడంలో రచయితలు రచయిత్రులు ఒకరితో ఒకరు పోటీపడుతున్నారు శ్రీకొమ్మనాపల్లి గణపతిరావుగారు తమ ప్రణయ ప్రబంధం సీరియల్ నవలా ద్వారా I Q ను పరీక్షించే *Mind Boggign Quiz programe* తో పేజీలను నింపేస్తూ *Quig master* తోపోటీ పడుతున్నారు కథనం కారణంగా పాఠకుల్ని ఆకట్టుకొంటున్నారు. ఈ నవలలోని పాత్రల ద్వారా వారం సంవత్సరం కాలంలో జరిగిన రాజకీయ సంఘటనలను ఏకరువు పెడుతున్నారు కర్నాటక మాజీ ముఖ్యమంత్రి బొంబాయి వాస్తవ్యుడైన లోఖుడూలాకు NRIల పేరిట బెంగుళూరులో భూమిని కేటాయించిన విషయాన్ని ప్రస్తావించారు. విద్యార్థుల సమస్యలను చిత్రించాలన్నది వీరి ఉద్దేశ్యం కావచ్చుకాని సౌదామిని పాత్రద్వారా నేటి పామెలా బోర్డన్ను' నాటి క్రిస్టియన్ కీలరును పాఠకులకు గుర్తు చేస్తున్నారు.

సమకాలీన సమస్యలు, సంఘటనలు చరిత్రగా మారటానికి పాతిక సంవత్సరాలవుతుంది. కాని తెలుగు నవలలో ఒకటి రెండు సంత్సరాల కాలములోనే నమోదవుతున్నాయి. అడవి సూర్య కుమారి 'సాగర మథనం' (ఆంధ్ర పత్రిక)లో శ్రీలంక సమస్యను విపులంగా చిత్రించింది. కవితకే కాదు నవలకుకూడా ఏది అనర్హంకాదు. నిరూపించడానికి తెలుగు సినీపరిశ్రమకు చెందిన ఒక సూపర్ హీరో నిజజీవితంలో జరిగిన సంఘటనను పోలీసుకేసును 'సూపర్ హీరో' పేరులో నవలగా చిత్రించారు. శ్రీమతి మన్నెం శారద గారు. నటి శ్రీమతి సావిత్రి జీవిత కథను నవల రాయగా శ్రీ బి. సి. జీవిగారు తెలుగులో అనువదించారు ఇంత వరకు నటుల జీవిత చరిత్రలు సచిత్రంగా ప్రకాశకులు ప్రచురించారుకాని మన్నెం శారదా గారు దానికి నవలా రూపం యిచ్చారు. నవల ఈ విధంగా తయారవడం వల్ల తన ఉదాత్తతను పోగొట్టుకుంటున్నదేమో అన్న భావన కలుగుతోంది.

రాజకీయ నాయకుల ప్రాపీణ్యం బాగా పెరిగినందువల్ల ఈ రోజు వారు పెద్ద సాంఘిక సమస్యగా తయారయ్యారు. ఇంత వరకు వచ్చిన నవలల్లో ప్రభుత్వ విధానాన్ని గర్హిస్తూ సాంఘిక సమస్యలవైపు పాఠకుల దృష్టిని మళ్ళించేవారు. కాని ఇప్పుడు వస్తున్న నవలలు రాజకీయ నాయకులను పాత్రలుగాచేసి వారి చుట్టూ కథల్లుతూ, అందే రోజు వార్తాపత్రికలలో వస్తున్న వార్తలను ఒక పద్ధతిలో రాసుకుంటూ పోతున్నారు. ప్రణయ ప్రబంధం (కొమ్మనాపల్లి గణపతిరావు) నవలలో ముఖ్యమంత్రి (వాసుదేవరావు) హోంమంత్రి పద్మనాభం పాత్రలు. అట్టి పీఠవి మరో నవల గ్రాండ్ (హారిక)లో దేశ ఉప ప్రధాని ఒక పాత్ర యండమూరి స్టూవర్టుపురం పోలీస్టేషన్ (ఆంధ్ర జ్యోతి)లో రాష్ట్ర హోంమినిష్టర్ ప్రసక్తితోపాటు రాష్ట్ర ముఖ్యమంత్రి పేరుకూడా సమానంగా వస్తుంది. అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయం రాష్ట్ర హోంమంత్రి భార్య కామిని నిజంగా జారిణి న్యాబ్రూయాత్ సత్యమప్రియం అన్న సంగతి ఈ రోజు వస్తున్న నవలలు చూస్తుంటే మనకు అర్థం అవుతుంది.

రాజకీయ నాయకుడితోపాటు ఈరోజు రచయిత కూడా పెద్ద సాంఘిక సమస్యగా తయారయాడు తమ స్వంత భావాలను అంటే కేవలం ఇతరుల వతకే అన్న భావాలను ప్రజల మీద ఆకర్షణీయమైన భాషలో రుద్దుతున్నారు. నవలను

తోటినవలాకారులను విమర్శించేందుకుకూడా వాడు కుంటున్నారు ఫలానా నవలకారుడు నవలా కారిణి వ్యక్తిగత సమస్యలను సమకాలీన సమస్యగా చిత్రిస్తున్నారు. సెక్స్ రచయితలు చెత్త సాహిత్యం రాస్తున్నారు. నిద్రాణమైన కోరికల ను రెచ్చగొడతారు...నిజానికి ఇలాంటి (సెక్స్) పుస్తకాలు రాసేవారు రచయితలు కారు. సమాజానికి చీడపురుగులు స్త్రీగురించి చాలా ఎక్కువగా తెలుసునని చెప్పకోవాలన్న తాపత్రయం కాని అటువంటి పుస్తకాలు రాసే వారికి స్త్రీ గురించిన కనీస పరిజ్ఞానం కూడా లేదు అభిమానులమంటూ అమాయకంగా తమ దగ్గరికి వచ్చిన ఆడపిల్లల్ని స్వసుఖానికి ఉపయోగించుకుంటున్నారు. ఆ మేధావులైన రచయితలు (19–9–90) బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నారన్న విషయాన్ని సమకాలీన సమస్యగా చిత్రించారు రచయిత్రి కాకానికమల.

పోలీసుశాఖలో ఉన్నతోద్యోగులు, చిన్న ఉద్యోగులు ప్రజలకు సహాయం చేయడం మాని వేసి రాజకీయ నాయకులకు వంత పాడుతున్నారన్నది సత్యం ఈరోజు వారపత్రికలలో వస్తున్నముప్పాతిక నవలల్లో పోలీసు వారి దుర్నీతిని ఖండిస్తున్నారు. నవలలు చదవడం ద్వారా వ్యక్తులలో మార్పు వచ్చే మాట నిజమైతే ఈ పాటికి లంచగొండితనం, బంధుప్రేమ, మారిపోయి వుండాలి. కాని అలా జరగలేదు.

స్త్రీలలో ముఖ్యంగా ఈతరం యువతులు చదువు కారణంగా, పాశ్చాత్య సభ్యత కారణంగా స్వతంత్రంగా ఆలోచించగలుగుతున్నారు. తమ జీవితాలకు సంబంధించిన నిర్ణయాలను వారే తీసుకుంటున్నారు. 'ఎంత దూరం ఈ పయనం'లోని రాజలక్ష్మి తప్పనిసరి పరిస్థితులలో ఎదురిస్తుంది. తండ్రి ఎవడో ఒక దారిన పోతున్న దానయ్యను తెచ్చి పెళ్ళి పీటమీద కూర్చోబెట్టి పుస్తెకట్టించుకో అంటే తలవంచి అతనిచేత తాళికట్టించుకోవడానికి నేను పన్నెండేళ్ళ పసిదాన్ని కాదు.

ప్రమదావనం శీర్షికలో మన కల్చర్ అన్న వ్యాసాన్ని (ఆంధ్రప్రభ 8–8–90) రాస్తూ ఈరోజు వస్తున్న సాహిత్యాన్ని గురించి శ్రీ ఎ. రంగ ఇలా రాశారు నేడు వస్తున్న క్రైమ్, థ్రిల్లర్ స్మగ్లర్ల, గూండాల దోపిడీల, కిడ్నాపులు భూత పిశాచాల భయంకర చర్యల సాహిత్యం' అన్నారు. నిజంగా ఇవన్నీ మన సమకాలీన సమస్యలే. ఈ సమస్యల్నే మన రచయితలు చిత్రిస్తున్నారు. కాని రచయితలకు ఈ సమస్యలవాడి సరిగ్గా అందటం లేదు.

పేజీలు నింపేందుకు, సర్క్యులేషన్ పెంచేందుకు నవల సాధనంగా వాడబడుతున్న నిజాన్ని మనం మరచిపోకూడదు. సమర్థవంతులైన రచయితల ప్రతిభ ఆదిపించిన వెన్నెలవుతున్నది ఈ రాహుకాష్టాన్ని (ద్విభాష్యం రాజేశ్వరిరావు). పూర్తిగా కాలనివ్వాలి. అప్పుడే ప్రయోజనాత్మక నవల, సాంఘిక పరిస్థితులను చిత్రిస్తూ సరైన మార్గం చూపే నవల రాగలదు.

డా॥ ఎ.బి. సాయిప్రసాద్

# పుస్తక సమీక్ష

## ప్రతిబింబాలు
### (ఖండ కావ్య కదంబము)

హృద్యమూ, అనవద్యమూ అయిన పద్య రచనలో ఆరితేరినవారు శ్రీ ఊట్ల కొండయ్య, వీరు ఇదివరలో సంతరించిన 'వానవచ్చె—వరదవచ్చె 'చాకిరేవు' మొదలైన కృతులు సహృదయుల మన్ననలందుకున్నవి. 'చాకిరేవు' కావ్యానికి తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి లభించింది. కొండయ్యగారు తమ గురువైన కాటూరి వేంకటేశ్వరరావుగారి పేరుతో 'కాటూరి కవితాపీఠం' అనే సంస్థ నెలకొలిపి పుస్తక ప్రచురణ సాగిస్తున్నారు. శ్రీ కొండయ్య 76 ఏండ్ల వార్ధక్యంలో కూడా అవిశ్రాంతిగా కవితారచన చేయడం మిక్కిలి అభినందనీయం.

ప్రస్తుత పుస్తకం 'ప్రతిబింబాలు' ఖండ కావ్య కదంబం. ఇందులోనివి ఒక్క గేయం తప్ప అన్నీ పద్యకవితలే. శీర్షికలు 26. పద్యాలు సులభ శైలిలో ధారాళంగా సాగినవి భావం స్పష్టత కలిగి పఠితలను ఆనందింప జేస్తుంది. మచ్చుకు కొన్ని పద్యాలు ఉదహరింపబడుతున్నాయి

'హిందూ ముస్లిం క్రైస్తవ
సందోహాస్పదము నా ప్రశస్తమతమ్మై
సుందర శివ సత్యములకు
స్యందనమై ధరణికిన్ శుభావహమయ్యెన్'

అంటూ గాంధీ భక్తుడైన ప్రభాకర్జీని గూర్చి చెప్పిన ఈ పద్యం ఆయన వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తున్నది.

విశ్వనాథ సత్యనారాయణను గూర్చి చెప్పిన ఈ దిగువ పద్యం మనోహరమూ, చమత్కారవంతమూ అయియున్నది.

'విశ్వనాథ మనుచుఁ బిలిచినఁ జాలును
మా త్రిలింగ పుణ్యధాత్రిలోనఁ
బ్రన్ననంపు బ్రాట కిన్నరయైపాడు।
బద్యకోద వేయిపడగలెత్తు

'నరహరిజనుడు' అనే శీర్షిక క్రింద వ్రాసిన ఈ దిగువ పద్యం గమనింప దగినది

'నాల్గుకులములు సృజియించినాను నేను
నాల్గు పాదాల ధర్మమున్ నడుపుదునని
పంచమమ్ముగను గని యూరి బయట వైచి
నపుడె పాపాంకురార్పణ మాయె నాకు

ఇంకా ఇందులోని 'శ్రీనాథపూజ' పుట్టినింటి ప్రమోద' 'అంగీరసతో అభిభాషణము" మొదలైన పద్యాలు భావయుక్తములై హృద్యంగా ఉన్నాయి.

రచన—'కవిపితామహ' ఊట్ల కొండయ్య
వెల 6 రూపాయలు
ప్రతులకు—కాటూరి కవితాపీఠం
మాధవ ప్రింటర్స్, కుత్బీగూడ
హైద్రాబాదు—500 027

వేముగంటి

# సంస్కృతాంధ్ర నిఘంటువు

ఈ నిఘంటు రచయిత వత్సా వేంకట శేషయ్య ఇరువదవ శతాబ్దిలోని వ్యక్తి ఈయన సంస్కృతాంధ్ర పండితుడుగా కనిపిస్తున్నాడు. వెంకట శేషయ్య మద్రాసులోని థియసాఫికల్ సొసైటీ మద్రాసు శాఖకు కార్యదర్శిగా ఉన్నవాడు ఈయన అవతారికలో నిఘంటువును గూర్చడంలో తన ఆశయాన్ని ఈవిధంగా తెలియజేస్తున్నాడు. 'తెలుగు లిపిలో సంస్కృతాంధ్ర నిఘంటు వొకటి యును లేకుండుట సాధారణముగ సంస్కృతాంధ్ర విద్యార్థులకును బాధకముగ నుండు సంగతి విశేషముగ, జెప్పనక్కరలేదు'

అందువల్లే తాను ఈ నిఘంటువు కూర్చానని చెప్పినట్లైంది. ఇంకా తన ఉద్దేశమును వేంకట శేషయ్య ఈలా వెల్లడించాడు.

'తెలుగు లిపిలో నిదివరకు ప్రచురింపబడిన నిఘంటువు లేవన నీ శతాబ్దాదియందు మామిడి వెంకటార్యుల గారిచే రచింపబడిన శబ్దార్థ కల్ప తరువు, సర్వశబ్ద సంబోధిని, అమరకోశము, నానార్థ రత్నమాల మొదలగు వానిలో లేని శబ్దములగు క్రియా పదముల యర్థమును వివరించి యున్నవాడను"

అకారాది నిఘంటువులు తన కాలంలో ఉన్నను క్రియాపదముల అర్థాన్ని తెలుపడం వేంకట శేషయ్యగారి ఈ నిఘంటువుయొక్క విశిష్టత

ఉదాహరణకు కొన్ని క్రియాపదాలను పేర్కొనడం జరిగింది.

1 అవేక్షత (ధా) ఉక్షసేచనే–చల్లెను (శపే–ప)
2. కర్దతి (ధా) శపే–ప. కర్దగతే–వెళ్ళుచున్నాడు
3. గుడతి (ధా) శపే–ప–గుడ రక్షాయాం– రక్షించుచున్నాడు.
4 పజ్జ్రితే (ధా) ఆ–శపే–పచివ్యక్తీకరణే– విభాగము చేయుచున్నాడు.
5. మన్దతి (ధా) ప–శక–చిఱుకరించు చున్నాడు కలియబెట్టుచున్నాడు. హింసించుచున్నాడు
6. రుంటతి (ధా) ప–శప్–రుటిస్తేయే–దొంగ తనము చేయుచున్నాడు.

క్రియా పదాలకు సంబంధించిన సంకేతములు ఈలా వివరింపబడినది.

రచన–వత్సా వేంకట శేషయ్య

వెల 60 రూపాయిలు

ప్రతులకు–ప్రాచీన పబ్లికేషన్స్
1–1–336/73, చిక్కడపల్లి
హైదరాబాదు–500 020

'ధా' ధాతువు 'ఆ' ఆత్మనే పది, 'ప' పరస్మైపది 'శప్' శబ్యకరణము. 'ఉ' ఉభయము

ఈ నిఘంటువు సంస్కృతాంధ్ర విద్యార్థులకే కాక సాహితీ పరులకు కూడా ఎంతో ఉపకరించేదిగా ఉంది. నిఘంటువులోని పదాలు సేకరించినట్లుగా గ్రంథకర్త తెలిపాడు.

1. నామలింగానుశాసనము 2 నానార్థరత్నమాల 3. విశ్వప్రకాశము 4. సిద్ధాన్త కౌముది 5. సర్వశబ్ద సంబోధిని 6. శబ్దార్థ కల్పతరువు.

ఈ నిఘంటువులో శబ్ద రత్నాకరము, సూర్యారాయ నిఘంటువులోని పదాలుకూడా ఉండ విశేషం.

ఈలాంటి ఉత్తమమైన గ్రంథాన్ని ప్రచురించిన ప్రాచీ పబ్లికేషన్సువారు మిక్కిలి అభినందనీయులు.

—వేముగంటి

పార్లపల్లి రామారావు గారి

# అక్షర దీప్తి

శ్రీరామారావుగారు ఈ శతాబ్దపు తొలినాళ్ళ రచయితలలో ఒక్కరు. వరంగల్లుజిల్లా గర్వించ దగిన కవులలో ఈయన ఒక్కరు. అతి నిరాడంబరు లలో నిరాడంబరుడు ఈయన ఏమాత్రముప్రచారం అంటే గిట్టనివాడు. తనరచనలేమో తనుఏమో అన్నట్లుగా ఉంటారు. తన కవిత్వము, వ్యాసంగమే తన లోకంగా బ్రతుకుతున్నాడు. పార్లపల్లి రామారావుగారు యోగిలాంటివారు ఆ యోగత్వం నుండే ఈ కవితలు జాలువారినవని చెప్పవచ్చును. ఎందుకంటే ఆయన కవితోక్తులు నిరామయ జీవితం నుండి వెలువడినట్లుగా చూడడమే.

లోగడ రామారావుగారి కవితలకు బళ్ళారి కవిమిత్రులు "చుక్కలు" పేరుతో ప్రచురణ తీసుకురాగా, అందులోని కొన్ని కవితలను యువ భారతివారు "మెఱుపులు" అను పుస్తకముగా వేశారు. ఈ మెఱుపుల ప్రస్తుత అను పుస్తకమే "అక్షరదీప్తి" ప్రచురణ కావడానికి కారణ మయింది. హైదరాబాదులో చిల్లరదుకాణం నడుపు కుంటున్న ఒకవ్యక్తి చిత్తుకాగితాలలో ఈపుస్తకం చూడటం, చదవడం, స్పందించడం, రచయితకు నాలుగువేల రూపాయలు అందించడం జరిగింది. వాటిని వృథాకానివ్వకుండా, ఆ సౌహార్ద్రతకు ప్రతి రూపంగా వారి కవితలకు 'అక్షరదీప్తి'గా అందిం చారు. ఆ దాత మంగళంపల్లి శ్రీకృష్ణయ్య గారు. పాఠకులకు కూడా దాతకు, రచయితకు కృతజ్ఞ తలు చెప్పుకోవాలి.

ఇకకవితా సంపుటిలోకి వెళ్ళితే

'మనుషులమధ్యకువస్తే అహం పెరుగుతుంది
గొప్పలు చెప్పుకోవడమే పని అయిపోతుంది
చెట్లమధ్య ఉంటే
వినమ్రత, ఓర్పు, ఫలాపేక్ష లేని
త్యాగ నిరతి అలవడు తాయి.
చెట్లు నాకు గురువులు.

... ... ....

"రచన ఒకటే అయినా
అది చదివే వారి
స్వభావ సంస్కారాల బట్టి
దాని ప్రతి రూపాంతరం చెందుతుంటుంది"

అందుకే కవిత్వం అనుభవించే వాడినను సరించే రసకందాయం అవుతుంది అంటారు.

---

(అక్షరదీప్తి–పార్లపల్లి రామారావుగారి కవితా సంపుటి. ప్రతులకు–రచయిత, తాటికాయల వయా పెద్దపెండ్యాల. వరంగల్లుకు 6142–వెల రు12/- పుటలు 98+8

---

ఒక హృదయం నుండి
మరొక హృదయానికి
నడిచే ప్రవాహ గుణము
ఏ రచన కైతే ఉన్నదో, ఆరచనకు చావులేదు.'

రామారావు గారు తమ కవితల్లో నిత్యము అయినది, సహజ జీవలక్షణాలు కల్గిన అంశాలను ఎన్నో కవితోక్తులుగా అందించారు. ఆయన సత్య వాది. ఇందులోని ఆణిముత్యాలను పరిచయం చేయాలంటే మొత్తం పుస్తకాన్ని ఇక్కడ ఉదా హరించాల్సి వస్తుంది.

ముఖే ముఖే సరస్వతి కదా! ఆసరస్వతి కి 75 సం॥ల వయస్సులో కూడా నిత్యనూతనంగా ఆలోచింపడం కవిత్వం, కథలు చెప్పగల రామారావు గారికి అభినందనలు.

డా॥ టి. శ్రీరంగస్వామి

# వార్తావాహిని

## హిందీ ప్రచారక ప్రశిక్షణ్ మహా విద్యాలయం, హైదరాబాదు 48వ స్వాతంత్ర్యదిన మహోత్సవం నివేదిక

ది 15–8–94 ఉదయం గం 9–00లకు ఆంధ్రప్రదేశ్ భూదాన్ యజ్ఞ మండలి అధ్యక్షులు, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ సి. పి. చారిగారు దక్షిణ భారత హిందీ ప్రచారసభ (ఆంధ్ర) ప్రాంగణంలో జాతీయ పతాకమును ఎగురవేసి భారత దేశమునకు సంపాదించిన దివంగత నాయకులను స్మరిస్తూ దేశ ఐక్యతకు హిందీ భాష కున్న ప్రాధాన్యతను వివరించారు.

అల్పాహార విరామము తరువాత శ్రీమతి కామేశ్వరి ప్రార్థనతో ప్రారంభమైన సభకు వేమూరి ఆంజనేయ శర్మగారు (మాజీరిజిస్ట్రార్, స్నాతకోత్తర విభాగం) అధ్యక్షత వహించారు. ఆంధ్రప్రదేశ్ మాజీమంత్రి శ్రీ ఎం. ఎస్. రాజ లింగంగారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. శ్రీ రాజ లింగంగారు 1947 ఆగష్టులో భారతదేశం స్వతంత్రమైనప్పటి నుండి యిప్పటి వరకు దేశ రాజకీయాలలో ప్రభుత్వాలలోను వచ్చిన మార్పులను సమీక్షిస్తూ సంవిధాన నిర్మాణ సభలో డా. రాజేంద్రప్రసాద్ ప్రభృతులు నిర్వహించిన స్వాతంత్ర్యమును గురించి చెబుతూ తెలంగాణా ప్రాంతంలో హిందీ భాష వ్యాప్తికి తాము చేసిన కృషిని విశదపరచారు.

హిందీ ప్రచారక్ ప్రశిక్షణ్ మహావిద్యాలయ ఛాత్రాధ్యాపకుల రచనలతో ప్రచురింపబడిన లిఖిత పత్రిక 'భాగమతి'ని దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర కార్యదర్శి శ్రీ శంకరశాస్త్రిగారు ఆవిష్కరించారు.

స్వాతంత్ర్య దిన సందర్భమును పురస్కరించుకొని, సభా కోశాధికారి శ్రీ చవాకుల నర సింహామూర్తిగారు, స్నాతకోత్తర విభాగాధ్యక్షులు ప్రొఫెసర్ దిలీప్ సింహ్‌గారు, బి. ఎడ్ కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ శ్రీనివాసవ్యాసాచారిగారు, రాష్ట్రభాషా ప్రవీణ మహావిద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ గోదా తిరుమలయ్యగారు, సభ కార్యవర్గ సభ్యులు శ్రీ కడారు మల్లయ్యగారు ఉపన్యసించిరి.

సభాధ్యక్షులు శ్రీ ఆంజనేయశర్మగారు, హిందీ ప్రచారక్ ప్రశిక్షణ్ మహావిద్యాలయం తరపున యీ ఉత్సవం జరుపుతున్నందుకు తన సంతోషాన్ని వెలిబుచ్చుతూ హిందీ భాషావ్యాప్తికి ఛాత్రాధ్యాపకులు చేయవలసిన కృషిని, వారి బాధ్యతలను గుర్తుచేశారు.

సభా ప్రారంభమున మహా విద్యాలయం ప్రిన్సిపాల్ డాక్టర్ ఎం. బి. వి. ఐ. ఆర్. శర్మ గారు అతిథులకు స్వాగతం పలికారు.

మహా విద్యాలయం లెక్చరర్ శ్రీ ఎస్. సత్య నారాయణగారు, అతిథులను సభకు పరిచయం చేశారు.

అతిథులను శాలువాలతో ఛాత్రాధ్యాపకులు సన్మానించారు. ఛాత్రాధ్యాపకులు సాంస్కృతిక కార్యక్రమమును ప్రదర్శించారు.

శ్రీమతి అర్చనాకుమారి కృతజ్ఞతాంజలి వందన ముతో సభ ముగిసినది.

## అమృత హిందీ పరీక్షా ప్రారంభోత్సవము

స్థానిక శ్రీ విద్యారణ్య ఓరియంటల్ హైస్కూలు ఆవరణమందు తేది : 22–8–94న 'ఆంధ్రసారస్వత సంఘ అధ్వర్యంలో, 'దక్షిణ భారత హిందీ ప్రచార సభ (మద్రాసు) అమృత హిందీ పరీక్షా ప్రారంభోత్సవం' జరుపబడినది సభకు అధ్యక్షత వహించిన

పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ ఎస్. విశ్వనాథరావు M.A గారు, తమ ప్రసంగములో జాతీయ సమైక్యతకు, జాతీయాభి వృద్ధికి, భారత ప్రజలలో సమైక్యత నెలకొల్పుటకు హిందీ భాష నభ్యసించవలెనని హితబోధ చేసిరి.

ముఖ్య అతిథులు, అనంతపురం జిల్లా, కన్వీనరు శ్రీ ఎ.బి ఉమాశంకర్ హిందీ ప్రచారకులు, 'జాతీయ భాషాభివృద్ధికి ద.భా. హిందీ ప్రచార సభ, (మద్రాసు) యొనర్చుచున్న సేవలను వివరిస్తూ. 75 సం.లు నిండిన సందర్భంగా జరుగుచున్న' అమృత హిందీ పరీక్షలకు విద్యార్థులు శ్రద్ధాసక్తులతో కూర్చొని, వ్యవహారిక హిందీలో నైపుణ్యతను సంపాదించవలెనని, ఉచితముగా నొసంగు పుస్తకములను పొందవలెనని

పాఠశాల హిందీ ప్రచారకులు శ్రీ కె బి. నారాయణరెడ్డిగారు, హిందీని ప్రశంసించుచూ, ప్రచారకులు ధన్యవాద ములు తెలిపిరి.

జాతీయ గీతముతో సభ ముగిసెను.

## వాణీ హిందీ విద్యాలయ 15 వ ప్రమాణ పత్రోత్సవం విజయ నగరం

తేది. 8.8.94 స్థానిక ఉల్లివీధి వాణిజ్య భవనంలో సా॥ 5–30 గం॥లకు వాణీ హిందీ విద్యాలయ ప్రమాణపత్ర వితరణ కడు వైభవంగా జరిగినది. పై కార్యక్రమానికి స్థానిక M.L.A. శ్రీ పి. అశోక్ గజపతిరాజు ముఖ్య అతిథిగా పాల్గొనిరి. గ్రూప్ ఫోటో అనంతరం సభకు విచ్చేసిన పెద్దలను హిందీ ప్రచారకులు శ్రీ వై. ఆంజనేయులు వేదిక పైకి ఆహ్వానించిరి. సా॥ 6 గం॥లకు, కుమారి, అరుణశ్రీ 'వందేమాతరం' ప్రార్థనా గీతంతో ప్రారంభమైనది.

సభ అధ్యక్షులుగా శ్రీ M. S కామేశ్వర రావు [అధ్యక్షులు, ఛాంబర్ ఆఫ్ కామర్స్, విజయ నగరం] వ్యవహరించిరి. తన అధ్యక్షోపన్యాసములో

హిందీ భాషను చిన్న–పెద్ద తారతమ్యం లేకుండా అందరూ నేర్చుకొనవల్సిందిగా కోరుతూ D.B.H.P. సభ పరీక్షలకు ఇంత పెద్ద ఎత్తున విద్యార్థులను తయారు చేస్తున్న హిందీ ప్రచారకులు శ్రీ వై ఆంజనేయులు ధన్యులని పలికిరి.

ముఖ్య వక్తగా సభకు వచ్చేసిన డా॥ శ్రీ పి. వి. ఎల్. సుబ్బారావు హిందీ భాష గొప్పతనాన్ని సభకు తెలియచేస్తూ, సారా ఉద్యమము, వయోజన విద్య వంటివి తెలుగు భాషలోనే ప్రచారం కావడం అంతగొప్పను సంతరించుకో లేదంటూ, అదే హిందీ భాషలోనే అయితే గొప్ప ఉద్యమమై యుండేదని "సారా" నిషేధం పై హిందీ కవితను వినిపించిరి. హిందీ ప్రచారకులు శ్రీ వై. ఆంజనేయులు తన వార్షిక రిపోర్టులో దక్షిణ భారత హిందీ ప్రచార సభ, హిందీ భాష ప్రచార, ప్రసారం జాతి సమైక్యతకు, జాతి ఐక్యతకు గొప్పసేవ చేస్తుందని చెపుతూ తను ప్రతీ సంవత్సరం ఒక సభ జరిపి విద్యార్థులకు పెద్దల ద్వారా వారికి సర్టిఫికెట్సు ఇప్పించటం తనకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తుందని వివరించిరి.

ముఖ్య అతిథి శ్రీ పి. అశోక్ గజపతి రాజు తన సందేశంలో జాతి ఐక్యతకు చేస్తున్న కృషికి అభినందనలు తెలియచేస్తూ విద్యార్థులతో హిందీ భాషతోపాటు తమ చరిత్రను (క్యారెక్టర్) చక్కదిద్దుకోవల్సిందిగా హితవు పలికిరి.

సభలో రాష్ట్ర స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత వాహినీపతి లింగమూర్తి MA. MEb, H.M., M.H.S. Kaspa, విజయనగరం వారి విద్యాలయం తరపున శ్రీ.P అశోక్ గజపతిరాజు దుశాలువాతో ఘనంగా సన్మానించిరి సన్మానితులు శ్రీ.v లింగమూర్తి విజయనగరంలో ఎన్నో హిందీ విద్యాలయాలున్నప్పటికి శ్రీ y. ఆంజనేయులు చేస్తున్నట్లు ప్రమాణపత్ర వితరణోత్సవాలు ఎవరూ చేయుట లేదని వాపోతూ, ఈ విధంగా ఉత్సవాలు చేస్తే విద్యార్థులలో హిందీ భాష పట్ల ఉత్సాహం ద్విగుణీకృతం అవుతుందని సభకు మనవి చేసిరి.

తదనాంతరం అమృత హిందీ సర్టిఫికెట్సు నుండి ప్రవీణ వరకు సుమారు 200 సర్టిఫికేట్సు విద్యార్థులకు ముఖ్య అతిథి శ్రీ.పి. అశోక్ గజపతి రాజు అందచేసిరి. హాఫ్ టెస్టు పరీక్షలో మంచి మార్కులు సంపాదించిన వారికి పెన్నులు అంద చేసిరి. రా॥ 8 గం॥ లకు శ్రీ y అంజనేయులు వందన సమర్పణతో సభ ముగిసినది.

# హిందీ ప్రచారక ప్రశిక్షణ విద్యాలయము– హైదరాబాదు.



15-8–94 తేదీన హిందీ ప్రచారక్ ప్రశిక్షణ మహావిద్యాలయం హైదరాబాదులో జరిగిన 48 వ స్వాతంత్ర్య దినోత్సవములో ముఖ్య అతిథిగా పాల్గొని ఉపన్యసించుచున్న శ్రీ ఎం.ఎస్. రాజలింగంగారు (మాజీమంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం) ద.భా హిందీ ప్రచారసభ (ఆంధ్ర) కార్యదర్శి, శ్రీ శంకరశాస్త్రి గారు, హిందీ మహా విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ గోదా తిరుమలయ్యగారు, సభ కార్యకారిణీ సమితి సభ్యులు శ్రీ కడారు మల్లయ్యగారు, ప్రచారక మహావిద్యాలయం ప్రిన్సిపాల్ డా॥ ఎం.బి.వి.బి. ఆర్. శర్మగారు కూడా ఉన్నారు.

అందమైన ముద్రణకు

# దక్షిణ భారత ప్రెస్

ఖైరతాబాద్, హైదరాబాద్-4



* తెలుగు
* హిందీ
* ఇంగ్లీషు
* సంస్కృత

భాషలలో ముద్రించబడును.

ఫోన్ : 317478

Edited Printed and Published by A. Sankara Sastry on behalf of the D. B. Hindi-Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad-500 004.